



Founder B.V. Radhakrishna

# బాలమిత్ర

బాలల సచిత్ర మాసపత్రిక

సహాయ సంపాదకుడు : బి.ఆర్. వరదరాజులు

సంపుటి : 63 అక్టోబర్ 2010 సంచిక: 10

పిల్లల పత్రికలలో ఎన్ని అవాంతరాలు వచ్చినా ఆగకుండా సక్రమంగా వస్తున్న పత్రిక బాలమిత్ర అని గర్వంగా చెబుతున్నాం. ఈ మధ్య కాగితం ధర విపరీతంగా పెరిగిపోయింది. ప్రింటింగ్ చార్జీలు పెరిగాయి. ఇక బాలమిత్రను 12 రూ. తీసుకురావడం చాలా కష్టంగా వుంది. అన్ని పత్రికలు వెలలు పెరిగినా ఇంతవరకు బాలమిత్ర వెలను ఎక్కువ చేయలేదు. ఇక రూ.12 తీసుకురావడం కష్టంగా వున్నందువలన ఈ నెల నుండి రూ.15/- పెంచవలసి వచ్చింది. పాఠకులు, ఏజంట్లు గమనించి ఎప్పటిలా మాకు సహాయ సహకారాలను అందించాలని హృదయ పూర్వకంగా కోరుచున్నాం.

- ఎడిటర్

విడిప్రతి : రూ.15/- 64 పేజీలు



# వక్రించిన తెలివి

రాజేష్‌కి పెద్దలన్న గౌరవంగాని, పెద్దల మాట వినాలన్న జ్ఞానం గానీ లేదు. అతడికి ఈ మధ్యనే ఓ ప్రభుత్వ కార్యాలయంలో ఉద్యోగం దొరికింది. అతనిపై అధికారం చలాయించే అధికారులు నలుగురైదుగురున్నారు. అందులో సింహాచలం గారొకరు.

సింహాచలంగారికి రాజేష్ తండ్రిగారైన విశ్వనాధంగారికి మంచి స్నేహం వుంది. దాని వల్లనే రాజేష్‌కా ఉద్యోగం దొరికింది. సింహాచలంగారి వయస్సు యాభై సంవత్సరాల పైనే వుంటుంది. వయసు పైన బడడం మూలాన, టైమ్‌కి టిఫిన్ చేయకుండా, ఉండలేక పోతున్నాడు. ఆఫీస్ కేంటిన్‌లో టిఫిన్ బాగుండదు. అందుకే ఓ రోజు టీ టైమ్‌లో రాజేష్‌ని పిలిచి "నాయనా, బైటకి వెళ్ళడానికి ఓపిక లేదు! నాలుగు ఇడ్లెన్లు, టీ కొనుక్కొని రా!" అంటూ టిఫిన్ డబ్బా యిచ్చాడు. ఆ మాత్రం పని చెప్పినందుకే రాజేష్ ముఖం దోరగా పండిన టొమాటోలా మారింది. అయినా ఏమీ అనలేక ఆఫీస్‌కు అర కిలోమీటర్ దూరంలో వున్న 'మురుగన్ విలాస్'కి వెళ్ళి ఇడ్లెన్లు, చట్నీ టిఫిన్ డబ్బాలో పోయించుకు వచ్చేసాడు.

ఆ మర్నాడు మరోలా ప్రతిమాలిన ధోరణిలో అదే పని చెప్పాడు సింహాచలం. 'గొడుగు తెచ్చుకొని కష్టమయినా, సుఖమైనా మర్నాడు తానే వెళ్ళి తీరాలనుకున్న సింహాచలం పైకి ఆ మాట చెప్పలేదు. రాజేష్ సింహాచలం వెళ్ళిన తర్వాత పళ్ళు పటపటా కొరికి టిఫిన్ డబ్బా లొత్తలు పడేటట్టు టేబిల్ మీద కొట్టాడు. అయినా రాజేష్ మనసు శాంతించలేదు. "ఈ ముసలి నక్క వెధవకి మరల పనిచెప్పకుండా తగినశాస్తి చెయ్యాలి!" అని కసిగా అనుకొని కదిలాడు.

ఎ. రాధ, కడప



మధ్యలో మెడికల్ స్టోర్ దగ్గర ఆగి, విరోచనాలవడానికి కాప్సిల్ తీసుకొని, ఇడ్లెన్లు కొని చట్నీలో క్యాప్సిల్ విప్పి మందు పొడి అందులో పోసాడు. "ఈ దెబ్బతో ముసలివాడికి ఇడ్లెన్ల మీద మమకారం పోతుంది!" అని కసిగా అనుకున్నాడు. టిఫిన్ సింహాచలం గారికి అందించాడు లోలోన ఆనందపడ్తూ.

సంతోషంగా ఇంటికి వచ్చిన రాజేష్, "అమ్మయ్య! ఈ పాటికి నా మందు పని చేస్తూ వుంటుంది. ఆ ముసలాడు చాలా అవస్థపడుతుంటాడు. రేపటికి ఆఫీస్‌కి రాడనుకుంటాను!" అని ఆనందపడసాగాడు.

అంతలో బయటికి వెళ్ళిన అతని తండ్రి విశ్వనాథం నీరసంతో లోపలికి అడుగు పెడుతూ, "రాజేష్! ఈ రోజు నాకు కడుపు సరిగా లేనట్టుంది, విరోచనం ఎక్కువవుతూంది. మందుల షాపుకి వెళ్ళి ఏదైనా విరోచనం నిలిచేందుకు మందు తీసుకు రా!" అన్నాడు.

"నేను ఇప్పుడే ఆఫీస్ నుండి వచ్చాను నాన్నా! తర్వాత వెళ్ళి తెస్తాను!" రాజేష్ తన గదిలోకి దూరాడు. తండ్రి సంగతి మరిచి పోయి, ఏదో నవల చదువుకో సాగాడు.

ఆ రోజు రాత్రి విశ్వనాథం పరిస్థితి విషమించి, అదే పనిగా లెట్రిన్‌కి వెళ్ళి వస్తూ వుండడం వల్ల - నేలబడి పోయాడు. రాజేష్‌కి ఆ అర్ధరాత్రి వేళ ఎక్కడికి పోవాలో అర్థం కాలేదు. ప్రక్క ఇంటి వాళ్ళను వెళ్ళి లేపాలనుకొని, మళ్ళీ ఆ పని మానుకున్నాడు. వాళ్ళని అర్ధరాత్రి తొందరపడి లేపితే, కసిరేసాడు రాజేష్. తల్లి వెళ్ళి ఎదురింటి అబ్బాయిని లేపి, పిలుచు కొచ్చింది. ఆ అర్ధరాత్రి పరుగులెత్తి వంద రూపాయలు ఖర్చు చేస్తే గానీ, విశ్వనాథం మనిషి కాలేదు.

రాజేష్ తన నిర్లక్ష్యం వల్ల తండ్రి పరిస్థితి అలా అయినందుకు చాలా బాధ పడ్డాడు.

మాటల్లో ఆ తర్వాత తెల్సింది - సింహాచలంగారికి తెచ్చి యిచ్చిన ఇడ్లెనల్లో విశ్వనాధంకి రెండిడ్లీలు పెట్టేడని తెలుసుకున్న రాజేష్ తాను చేసిన పని ఎంతో తప్పని, ఆ రోజు నుండి రాజేష్‌లో చెప్పుకోతగ్గ మార్పొచ్చింది.





# సత్యమే జయతే

బాగ్దాదు నగరంలో అబ్దుల్‌ఖాదర్ జిలాని అనే నిరుపేద బాలుడుండేవాడు. అతనికి తండ్రి లేడు. తల్లి మాత్రముంది. ఓ రోజున తమ పొరుగులో ఉంటున్న కొందరు వర్తకులు ఒక బృందంగా ఏర్పడి వ్యాపార నిమిత్తం ఇతర ప్రాంతాలకు వెళ్తున్నారనీ ఆమెకు తెలిసింది, తన కుమారుడిని కూడా వాళ్ల వెంట పంపి నట్లయితే కొంత వ్యాపారానుభవం కొడుకుకు అబ్బుతుందనీ ఆమె ఆలోచించింది. ఆ జట్టు నాయకుడికి తన కుమారుడిని కూడా తమ వెంట పిలుచుకొని వెళ్లాలనీ కబురంపింది. జట్టు నాయకుడు సమ్మతించాడు.

దీనితో ఆమె జిలానీని ప్రయాణానికి సిద్ధం చేసింది. కొంత డబ్బును కొడుకు దుస్తుల లోపల రహస్యంగా కుట్టింది. 'ఒరే బాబూ! నువ్వెలాంటి పరిస్థితుల్లోను అసత్యమాడకు. ఈ ప్రపంచంలో సత్యాన్ని మించిందేదీ లేదు. ఆ సత్యమే ఎల్లవేళలా నిన్ను కాపాడ్తుంది. ఈ మాట ఎన్నడూ మరువ వద్దు నాయనా! అంటూ ఉపదేశించింది.

అనుకున్న రోజుననే బాగ్దాదు వ్యాపారుల బృందం తన ప్రయాణాన్ని ప్రారంభించింది. ఆ దేశమంతా ఎడారుల మయం గదా! వ్యాపారులు ఎడారి గుండా ప్రయాణాన్ని కొనసాగిస్తూ ఒక రాత్రి ఓ చోట బస చేశారు. ఎడారి దొంగల భయం వారిని పీడిస్తున్నది. అయినా ధైర్యంగానే ఉన్నారు.

బాగా పొద్దు పోయింతర్వాత బందిపోటు దొంగలు వ్యాపారులమీద దాడి చేశారు. అందరి దగ్గరున్న సొమ్మును దోచుకున్నారు. ఇక మన జిలాని వంతు వచ్చింది. ఇంత లేబ్రాయంలోని ఈ బాలుడి దగ్గర ఏముంటుం దిలే అనుకున్నారు. అయినా అడిగి చూద్దామను

సయ్యద్ అబ్దుల్‌మునాఫ్, నంది కొట్కూరు, కర్నూలు జిల్లా



కొని వాళ్లు జిలానిని గద్దించి అడిగారు, 'నీ దగ్గర సొమ్ముందిరా?'

జిలాని నదురు, బెదురు లేకుండా నిజం చెప్పేశాడు, 'నా వద్ద కూడా కొన్ని దీనారా లున్నాయి', 'ఏది? ఎక్కడా?' అంటూ దొంగలు అతని జేబులు, సామానులో కూడా వెదికారు. వాడు అబద్ధం చెబుతున్నాడనీ భావించి వాడిని తమ నాయకుడి దగ్గరకు తీసికెళ్ళారు. నాయకుడు కూడా జిలానిని చూసి 'వీడి వద్ద ఏముంటాయిలే' అనుకున్నాడు. అయినా సందేహ నివృత్తికోసం జిలానిని గద్దించి అడిగాడు 'నీ వద్ద ఏం సొమ్ముందిరా?'

జిలాని భయపడకుండా 'అవునండీ! నా దగ్గర కొన్ని దీనారాలున్నాయంటే నమ్మరేం?' అన్నాడు.

'ఏవీ! ఎక్కడా!'

'మా అమ్మ నాదుస్తుల్లో రహస్యంగా కుట్టింది' అని నిజం చెప్పేశాడు. నాయకుని ఆదేశం మేరకు దొంగలు వాడి దుస్తుల్లో వెదికారు. కొన్ని దీనారాలు కనిపించాయి. వాటిని తమ నాయకునికిచ్చారు.

దొంగల నాయకునికి ఆశ్చర్యమేసింది. ఆ పిల్లవాని సత్య సంధత అతడిని అబ్బుర పర్చింది. మనసులో మెచ్చుకున్నాడు.

'ఎందుకురా నిజం చెప్పి డబ్బు మా పాల చేశావు? లేవని చెబితే ఈ దీనారాలు నీకే ఉండి పోయేవి కదా?' అని జిలానిని ప్రశ్నించాడు.

'లేదండీ! నేనెప్పుడూ అబద్ధం చెప్పను. అలా అని నేను మా అమ్మకు మాట ఇచ్చాను. ఆమె ఆజ్ఞానుసారంగా నేను నిజం చెప్పాను,' అన్నాడు జిలాని దృఢంగా.

ఆ పిల్లవాడి మాతృవాక్య పాలనకు దొంగల నాయకునికి ముచ్చటేసింది. దౌర్జన్యాలు, హింసతో కూడిన అతని జీవితంలో ఎప్పుడూ ఇలాంటి అరుదైన సంఘటన జరుగలేదు. ఆ చిన్నబాలుని సత్యనిష్ఠ, మాతృభక్తితో ఆ గజదొంగ సిగ్గుపడిపోయాడు. బాలుడితో బాటు మిగతా వర్తకులను కూడా విడిచి వేయా ల్సిందిగా ఆజ్ఞాపించాడు. అతని ఆదేశాల మేరకు దొంగలు వాళ్ల సొమ్మును కూడా తిరిగి ఇచ్చేశారు.



# వింత వింత ఇళ్ళు

ఇల్లు కట్టి చూడు - పెళ్లి చేసి చూడు అని ఒక సామెత వుంది. ఇల్లు కట్టడం, పెళ్ళి చేయడం రెండూ ఎన్నో సమస్యలు, ఆటంకాలు కలిగి వుండి కఠినతరంగా అనిపిస్తాయి. సమస్యల్ని ఆటంకాల్ని ఎదురొడ్డి ఆ కార్యాలు నెరవేర్చడంలోనే ఆనందముంటుంది. ఇల్లు కట్టడం విషయానికొస్తే వెండి చెంచా నోట్లో పెట్టుకుని పుట్టిన బడా బాబులకు తప్ప దాదాపుగా అందరికి జీవితాశయమే ఇల్లు కట్టుకోవడం. ఆ కట్టే ఇల్లు కళాత్మకంగా వుండేట్లు చూసుకునే రసప్రియులు వున్నారు. అలా మామూలుకు భిన్నంగా కట్టిన ఇళ్ళ వివరాలు కాసిన్ని గమనిద్దాం!

★ పోర్చుగల్ దేశంలో ఒక ఆసామి ఒక పెద్ద కొండను ఎన్నుకుని ఆ రాతిని తొలిచి అందులో గదులు ఏర్పాటు చేసుకుని పై కప్పు కొండరాయి అనుకునేట్లు వేసుకుని ఒక చక్కటి ఇల్లు కట్టుకున్నాడు.

★ గల్ఫ్ దేశమైన యెమన్‌ను ఒకప్పుడు పాలించిన ఇమామ్ యాహ్యా అనే రాజు ప్రశాంతమైన వాతావరణం వుండే చోట విశ్రాంతి భవనం నిర్మించాలనుకున్నాడు. అయినా ఓ కొండనే ఎంచుకున్నాడు. ఆ కొండలోని ఒక పెద్ద రాయి మీద అయిదు అంతస్థుల భవనం కట్టించాడు. 1930లో నిర్మించిన ఈ విశ్రాంతి భవనం ఇపుడొక యాత్రా స్థలం.

★ అమెరికాలోని మిస్సోరి రాష్ట్రంలో కాన్సస్ అనే నగరం ఒక గ్రంథాలయం గోడలని పుస్తకాలను ఒక దానిపై మరోటి పేర్చితే ఎలా వుంటాయో అలా నిర్మించారు. గ్రంథాలయంలో చదవడానికొచ్చే వారికన్నా ఆ లైబ్రరీ చూడడానికి వచ్చే పర్యాటకుల సంఖ్య ఎక్కువగా వుండటం విశేషం.

★ పోలండులో డేనియల్ అనే వ్యాపారవేత్త తన ఇంటిని పూర్తిగా తలకిందులైతే ఎలా వుంటుందో అలా కట్టించుకున్నాడు. ఇంట్లోని వస్తువుల్ని సైతం తలకిందులుగానే నిర్మించారు. ఈ వింత ఇల్లు 114 రోజులలోనే కట్టారు.

★ బ్రిటనులో హిమ్లే అనేవూరిలో ఒక పబ్ నిర్మించారు. పునాదులకింద బొగ్గు తగిలితే చాలా లోతు వరకు వెళ్ళి దాన్ని తవ్వేశారు. ఆ పైన భవనం నిర్మించేశారు. ఆ తర్వాత భవనం లోతుగా తవ్వినవైపు 15 డిగ్రీల కోణంలో ఒరిగిపోయింది. లోపల బల్లలు కుర్చీలు అన్నీ ఒక వైపు ఒరిగివుంటాయి. బాటిల్స్, గ్లాసులు వాటిమీద వుంచితే దొర్లిపోతాయి. అలా ఒక పక్కకు ఒరిగిన పబ్ చూడటానికి విపరీతమైన జనం వస్తారు.

★ మెహలాన్ హెన్ అనే ఆసామి 1948లో పెనెన్ సెల్వియాలో ఒక బూటు ఆకారంలో ఇల్లు కట్టించాడు. అడుగున 7.5 మీటర్ల వెడల్పు 14.5 మీటర్ల ఎత్తుంటుంది. బూటు అడుగున ప్రవేశద్వారం, బూటుపైన ఇంటిపై కప్పు వుంటాయి. అన్ని ఇళ్ళలాగే లోపల గదులుంటాయి.

*టి. సాయికుమార్, హైదరాబాద్*



# ఆణిముత్యాలు

1. పెంపొందించబడి ఆచరణలో పెట్టబడిన ఒక ఆలోచన కేవలం ఆలోచనగా మిగిలి పోయే దానికంటె ఎక్కువ ముఖ్యమైనది.
   గౌతమ బుద్ధుడు
2. మనం ఇతరుల కోసం చేసేది మాత్రమే నిజంగా చేయతగినదనేది జీవిత రహస్యాలలో ఒకటి.
   లెవిస్ కెరోల్
3. వేదాంతి తను నిశ్చయం తీసుకునే కర్తవ్యం నుంచి తప్పించుకోకూడదు.
   మోర్టిమర్ ఆడ్లర్
4. మనిషి అతికష్టం మీద దాచిపెట్టే రహస్య మేమంటే తనను గురించిన తన అభిప్రాయం.
   మార్సెల్ ప్యాగ్‌నాల్
5. నీవు వార్తా పత్రికలలో చదివే వార్తలను నమ్మాలి. ఎందుచేతనంటే అప్పుడే అవి నీకు ఆసక్తికరంగా వుంటాయి.
   రోజ్ మెకాలే
6. స్వేచ్ఛ అంటే మనకు లభిస్తుందని మనం ఊహించని ఒక అవకాశం.
   డేనియల్ జె. బూర్‌స్టిన్
7. ఊహాశక్తి ఎన్నడూలేని లోకాలకు మనలను తీసుకు వెళ్తుంది. కాని అది లేకుండా మనం ఎక్కడికీ వెళ్లలేము.
   కారల్ శాగన్
8. మానవుడు తను జన్మించిన శూన్యాన్ని తను ప్రవేశింపబోయే అనంతాన్ని చూడలేడు.
   బ్లెయిజ్ ప్యాస్కల్
9. భవిష్యత్తును చెప్పటానికి మిక్కిలి ఎక్కువగా ఆధారపడదగిన పద్ధతి ఏమంటే వర్తమానాన్ని అర్థం చేసుకోవడం.
   జాన్ నేయిస్ బిట్
10. కలలకి ఒక్కొక్క సారి ఒక్కొక్క యజమాని మాత్రమే వుంటాడు. అందుచేతనే కలలు కనే వాళ్లు ఒంటరిగా వుంటారు.
    ఎర్మాబోంబెక్

కె. శ్రీనివాస శాస్త్రి, హైదరాబాద్

ప్రసిద్ధ దేవాలయములు

# ధవళేశ్వరం

## శ్రీ అగస్త్యేశ్వరస్వామి ఆలయం

త్రేతా యుగము నుండి అటు మహర్షులచేత ఇటు దేవతలచేత పూజలు అందుకున్నట్లు గౌతమీ మహత్యము కాశీ ఖండాలు తెలుపుతున్నాయి.

ధవళగిరి (ధవళేశ్వరం) లో శ్రీ ఉమా అగస్త్యేశ్వర స్వామి, శ్రీ లక్ష్మీ జనార్ధనస్వామి, శ్రీ ఆంజనేయస్వామి వాళ్ళ మూడు దేవాలయాలు ఒకేచోట ఉండడం విశేషం.

శ్రీ అగస్త్యేశ్వర స్వామి స్థల పురాణం: అగస్త్య మహర్షి వింధ్య పర్వతముల వద్దకు వెళుతూ తాపేశ్వరము వద్దకు రాగా అచ్చట వాతాపి, ఇల్వలుడు అనే ఇద్దరు రాక్షసులచే ఆతిధ్యము తీసుకొని ఆహారముగా ఇవ్వబడిన వాతాపిని జీర్ణం చేసుకొన్నాడు.

అందుచేతనే అప్పటి నుండి జీర్ణము, జీర్ణము వాతాపి జీర్ణము అను మాట ఆవిర్భవించింది. అప్పుడు సోదరుడైన ఇల్వలుడు అగస్త్యుని మీదికి యుద్ధానికి రాగా యాత్రార్థిగా వచ్చిన అగస్త్య మహర్షి బ్రహ్మాస్త్రముచే ఇల్వలుని సంహరించాడు. అందుచేత ఆ గ్రామమునకు వాతాపేశ్వరమని వారు ధనందాచిన స్థలమును "అర్ధమూరు" అనే పేర్లు వచ్చాయి.

అగస్త్య మహాముని ఈ బ్రాహ్మహత్యా దోషమును పోగొట్టుకొనుటకై అఖండ గౌతమి ధవళగిరితో ఆఖరు కనుక అగస్త్యుడు ఇచ్చటకు రాగా శ్రీ అగస్త్య మహర్షికి జ్యోతిర్లింగ రూపమున "స్వయంభూవ" లింగము కనిపించెను.

స్వయం భూవలింగాన్ని పూజిస్తే నూరు రెట్లు ఫలితం లభిస్తుంది. అనే ప్రమాణ ముండుటచే అగస్త్య మహర్షి తొట్టతొలుత పూజించుటచే అగస్త్యేశ్వర స్వామి అనే పేరు సార్థకమైనది. అగస్త్యుడు, లోపాముద్ర ఇరువురును దేవి ఉపాసకులగుటచే "బాలాత్రి పురసుందరీ" అనే పేరుతో అమ్మవారిని ప్రతిష్ఠించి ఉభయులకునూ అర్చన చేసి బ్రహ్మ హత్యా దోషమును పోగొట్టుకొన్నారు.



"ఈ స్వామి లింగం ఈశాన్య భాగంలో ఒక పెద్ద పలకపై శిరస్సులో కొప్పులా ఉంటుంది". ఈశాన్య దిశగా లింగం మరే జిల్లాలో లేదు. త్రేతాయుగమున శ్రీ రామచంద్రుల స్వామిని పూజించినట్లుగా ఇక్కడ శ్రీరామ పాదాలు ఒక రాతి పలకపై ఉన్నాయి. అనేక మంది మహారుషులు దేవతలు ఈ లింగాన్ని పూజించి తరించినట్లు గౌతమి మహాత్మ్యం కూడా తెలుపుతోంది.

ఏకాదశ రుద్రాభిషేకం, సహస్రనామపూజ, అష్టోత్తరం, నవగ్రహపూజ సత్యనారాయణ వ్రతం లక్షపత్రి పూజలు నిర్వహించబడును. శ్రీ గణపతి, నవగ్రహాలు, సుబ్రహ్మణ్యేశ్వర స్వామి సత్యనారాయణస్వామి, శ్రీవాసవి కన్యకాపరమేశ్వరి కలవు. నాలుగు తరాలనుండి అర్చనా కార్యక్రమాదులు నిర్వహిస్తున్న అర్చకులు శ్రీ శంకర మంచి నరసింహమూర్తిగారు ఆలయంలో ద్వాదశలింగాలు అష్టకాలు భక్తులు చదువుకుందుకు ప్రాంగణం లోపల వ్రాయించారు. అమ్మవారి నవావరణార్చన పూజ ఇక్కడ విశేష ఆకర్షణ.

శ్రీ స్వామి వారి కళ్యాణం మాఘమాసంలో జరుగుతుంది. శ్రీ బాలాత్రిపుర సుందరి దక్షిణ ముఖంగా ఉంటుంది. మంగళవారం హనుమంతుడ్ని కొలవాలనుకున్నవారికి ఆలయంలో హనుమంతుడు వున్నాడు.

చూసి తరించవలసిన దేవాలయం నమశ్శివాయ అంటేనే మనస్సుకి శాంతి.

## లక్ష్మీ జనార్ధనుడు

ఇక్కడ ఉన్న ఆలయాలలో భక్తిని ముక్తిని ప్రసాదించేది శ్రీలక్ష్మీ జనార్ధనుడు. శ్రీ స్వామిని మనస్ఫూర్తిగా ప్రార్థిస్తూ శ్రీ ద్వివేది సత్యకవి శతావధాని వ్రాసిన శ్రీలక్ష్మీ జనార్ధన సుప్రభాతం అత్యంత అమూల్యం అయిన ఈ గ్రంథం వ్రాసి దాదాపు 15 సంవత్సరాలు దాటింది. ఆలయంలో భక్తుల పాలిట వరప్రసాదిని శ్రీలక్ష్మీదేవి ఆండాలు. మాఘశుద్ధ ఏకాదశినాడు స్వామికళ్యాణం.

ఆలయ ప్రాంగణంలో సంతాన గోపాలస్వామి ఆలయంపై వశిష్ఠుడు జమదగ్ని వంటి ఋషులు కలరు. ఆలయ ప్రాంగణం సుందరంగా ఉంటుంది. దాదాపు 100 మెట్లు ఎక్కితే స్వామి దర్శనమిస్తాడు.

రామపాదాల రేవులో శ్రీ ఆంజనేయస్వామి దర్శనమిస్తాడు.

డి. సత్యమూర్తి, రాజమండ్రి



# నిజాయితీ విలువ

రాజేశ్వరి ఓ ప్రభుత్వాఫీసులో జూనియర్ అసిస్టెంట్‌గా పని చేస్తున్నది. ఆమె నిజాయితీ, నిబద్ధత, నైతిక విలువలను కలిగిన మనిషి. ప్రతిరోజూ ఆమె తన స్వంత ఊరైన ఆవకూరు నుంచి అత్తిలిలోని ఆఫీసుకు వచ్చి వెళ్తుంటుంది.

ఓ రోజు డ్యూటీ ముగించుకొని ఆఫీసు నుండి బయట పడేసరికి ఆకాశం మేఘావృతమై.... చిరుజల్లు మొదలైంది. ట్రైన్ ఎక్కడ మిస్సవుతుందో అన్న భయంతో పరుగులాంటి నడకతో స్టేషన్ వైపు బయల్దేరింది. అంతలో ప్రక్కనే కారు ఆగిన శబ్దం! వేగంగా అటువైపు చూసింది రాజేశ్వరి. కారు విండోలోంచి చూస్తూ ఓ పెద్దామె "అమ్మా!... రైల్వేస్టేషన్‌కి వెళ్తున్నట్టున్నావ్!... వర్షం పడుతోందిగా రామ్మా! మేమూ ట్రైన్‌కోసమే వెళ్తున్నాం...." అందామె ఎంతో మృదువుగా. ఇక ఏమీ అనలేక కారు ఎక్కింది రాజేశ్వరి. మరో ఐదు నిమిషాల్లో స్టేషన్‌కి చేరుకున్నారు. ఆ పెద్దామె డ్రైవర్‌తో వెళ్ళిపోమని చెప్పి, రెండు బ్యాగులను రెండు భుజాల కెత్తుకొని, హ్యాండ్ బ్యాగ్‌ను చేత్తో పట్టుకొని స్టేషన్‌లోకి వెళ్ళింది.

ఆమె టికెట్ తీసుకొచ్చాక ఇద్దరూ వెళ్ళి ట్రైనెక్కారు, వర్షం ఊపందుకొంది. రాజేశ్వరి విండోసీట్లో కూర్చుని, ఆ ఆహ్లాదకరమైన వాతావరణాన్ని ఎంజాయ్ చేయసాగింది. ఇంతలో కైకలూరు స్టేషన్ వచ్చింది. "వెళ్ళొస్తానమ్మా!..." అన్న ఆమె పిలుపుతో ఈ లోకంలోకి వచ్చిన రాజేశ్వరి "ఓ.కె. మేమ్!" అంది సన్నగా నవ్వుతూ.

మరో పది నిమిషాల్లో ఆవకూరు స్టేషన్ వచ్చింది. రాజేశ్వరి దిగేందుకు లేవబోతూ,

గుబ్బల శ్రీనివాసరావు, *బొంతువారిపాలెం*



ఎదురుసీట్లో ఆపెద్దామె మరచి వెళ్ళిపోయిన హ్యాండ్ బ్యాగ్‌ను చూసి, "అరెరె పాపం! ఆవిడ ఆ బ్యాగ్ మరచిపోయినట్లున్నారు. ఈ హడావిడిలో ఒకరి వివరాలు ఒకరు మాట్లాడుకోనే లేదు. ఇంతకూ ఇందులో ఏమున్నాయో!... ఏంటో?.... ఆవిడ వివరాలు ఏమైనా ఉన్నాయేమో!... కనీసం మొబైల్ నెంబరు దొరికినా ప్రయోజనం ఉంటుందన్న సదుద్దేశ్యంతో బ్యాగ్ తెరిచింది రాజేశ్వరి. ఊహించని విధంగా అందులో రెండు జతల బంగారు గాజులు, పదివేల రూపాయలు క్యాష్ ఉన్నాయి. అంతకు మించి ఆమె వివరాలు కాని, మొబైల్ నెంబరు కాని దొరకలేదు.

ఆ మర్నాడు ఆఫీసుకు వెళుతూ, అత్తిలిలో ట్రైన్ రైల్వే పోలీస్ స్టేషన్‌కి వెళ్ళి తనకు దొరికిన బ్యాగ్ విషయం, ఆమెతో కలిగిన పరిచయాన్ని తెలిపి, ఆమెకు ఎలాగైనా చేరేలాగ చర్య తీసుకోమని చెప్పి, ఆ బ్యాగ్ హ్యాండోవర్ చేసింది.

వారం రోజులు గడిచాయి! ఓ రోజు మధ్యాహ్నం కానిస్టేబుల్ వచ్చి, "మేడమ్! ఎస్సైగారు మిమ్మల్ని ఒకసారి స్టేషన్‌కి రమ్మని చెప్పారు" అని చెప్పి వెళ్ళిపోయారు.

ఆ రోజు సాయంత్రమే రాజేశ్వరి ఎస్సైగారిని కలిసింది. ఆయన రాజేశ్వరిని కూర్చోమని చెప్పి, "మేడమ్!... మీరు బ్యాగ్ అందజేసిన వారి వివరాలు తెలిసాయి. నిజానికి ఆవిడ, మీరు బ్యాగ్ అందజేయక మునుపే తన బ్యాగ్ పోయినట్లు మాకు కంప్లైంట్ ఇచ్చారు. అయితే అందులో ఓ జత బంగారు గాజులతో పాటు ఇరవైవేలు క్యాష్ ఉందని రాసారు.



ఇచ్చేయండి... ఒక వేళ మీరు తీయకపోయినా ఆ బ్యాగ్ మీరే ఇచ్చారు కాబట్టి ఆ డబ్బు మీరు ఇచ్చి తీరాల్సిందే అని కటువుగా మట్లాడారు ఎస్సై.

ఎస్సై మాటలకు ఏమి సమాధానం చెప్పాలో అర్థం కాలేదు. రాజేశ్వరికి తన నిజాయితీకి ఇదా బహుమానం అనుకొంది. వాదించి లాభం లేదని నిర్ధారించుకొని, "సరే సర్! నిజాయితీకి పోయి తప్పు చేసింది నేను.... కాబట్టి నేనే శిక్ష అనుభవించాలి. మీరు అంటున్న పదివేలు నేనే ఇచ్చేస్తాను... కాని తప్పు ఒప్పుకొని కాదు. కేవలం మాటకోసం మాత్రమే! నా వెంట ఎవరైనా కానిస్టేబుల్ని పంపించండి. ఎ.టి. యమ్.లో డ్రా చేసి ఇచ్చేస్తాను" అంటూ లేచింది రాజేశ్వరి.

నాలుగు రోజులు గడిచాయి! రాజేశ్వరి మనసు మనసులో లేదు. జరిగిన సంఘటన

ఆ రోజు సాయంత్రం డ్యూటీ నుంచి స్టేషన్‌కు వెళ్ళేసరికి ట్రైన్ ఓ అరగంట లేటని తెలిసింది. ఉసూరుమంటూ బెంచీపై కూలబడింది రాజేశ్వరి. అంతలో రాజేశ్వరి ముందుకు ఆ పెద్దామె వచ్చినిలబడి, "అమ్మా! రాజీ! నేను చెప్పబోయేది సాంతం విను! నా పేరు రాజమణి, ఈ ఊరిలో ప్రముఖ వ్యాపారి అయిన సోమయ్యగారి భార్యను నేను. ఆ రోజున అనుకోకుండా నిన్ను స్టేషన్‌కి డ్రాప్ చేయడం, కలిసి ప్రయాణం చేయడం... నేను కైకలూరులో నా హ్యాండ్ బ్యాగ్ మరిచిపోయి ట్రైన్ దిగడం యాదృచ్ఛికంగా జరిగిపోయింది. బ్యాగ్ పోయిందన్న ఆవేదనలో నేను అత్తిలి స్టేషన్‌లో కంప్లైంట్ చేసినపుడు ఆ బ్యాగ్ ఎలాగూ తిరిగిరాదన్న ఉద్దేశ్యంతోనూ, అది తీసిన వ్యక్తి నిజాయితీగా అప్పగించినా పోలీసులే కాజేయవచ్చునన్న అనుమానంతో, అందులో బంగారు గాజులతో పాటు ఇరవై వేలు క్యాష్ ఉన్నట్లు కంప్లైంట్ చేసాను. తీరా! బ్యాగ్ దొరికిందని ఎస్సైగారు ఫోన్ చేసి, అందులో క్యాష్ పదివేలే ఉందని నీవు చెప్పావని చెప్పినపుడు ఓ ప్రక్క నేనూ ఆశ్చర్యపోతూనే, నేను అబద్ధమాడినట్లు అవుతుందనే ఉద్దేశ్యంతో మాటమార్చి చెప్పలేకపోయాను. నిన్ను చూస్తుంటే నిజాయితీకి నిలువెత్తు రూపంలా కన్పిస్తున్నావు. లోకంలో నిజాయితీ మిగిలే ఉందని నిరూపించావు. నీ ఉద్యోగం తదితర వివరాలన్నీ ఎస్సైగారి ద్వారా తెలుసుకొని మనసారా అభినందించడానికి వచ్చాను. నిన్ను చూస్తుంటే నాకు కూతురు ఉండి ఉంటే ఇలాగే ఉండాలి అన్పించింది. నాకు ఆడ పిల్లలు లేరు. ఆ లోటు నీవు తీర్చావనుకుంటాను. అప్పుడప్పుడూ కలుసుకుందాం!... మా ఇంటికి వస్తూ ఉండమ్మా..." అంటూ రాజేశ్వరి అదనంగా ఇచ్చిన పదివేల రూపాయలతో పాటు... "ఓ చక్కని బంగారు ఉంగరం ఇచ్చి ఈ ఉంగరం నేను నీకు ప్రేమాభిమానాలు కలబోసి చేయించాను. ఇది చూసినప్పుడల్లా నేను నీకు గుర్తు రావాలి" అంటున్న ఆమె కళ్ళు చెమర్చాయి. అనుకోని ఆత్మీయతతో రాజేశ్వరి కళ్ళలోనూ నీళ్ళు తిరిగాయి.








దాసీ ద్వారా సంగతులు విన్న రాకుమారి భయంతో బయటకు వచ్చింది. ఎద్దు రూపంలో వున్న తన భర్తని, ఆ ఇద్దరూ లాక్కురావడం చూసి బెదిరిపోయింది. గబగబా తన భర్త వద్దకు వెళ్ళి "ఇకనైనా మీ పంతం తీరిందా? ఆ విసనకర్రని వారికి ఇచ్చేస్తాను. లేకుంటే మీ ప్రాణాలు మిగలవు" అంది. "నాకు బుద్ధి వచ్చింది. వెంటనే వారికి ఆ విసనకర్రని ఇవ్వు. ఈ బాధ నేను భరించలేకపోతున్నాను" అన్నాడు మియాన్‌కాంగ్. "రాకుమారీ! ఆలస్యం చేయకుండా ముందు నువ్వు దాచిన ఆ వన్నెల విసనకర్రని నాకు ఇవ్వు. లేదా నీ భర్త నరకాన్ని చూస్తాడు" అన్నాడు చాంగ్.

"చాంగ్! నేను ఆ విసనకర్రని ఇస్తాను. ముందు ఆ తాడు వదులు. ఆయన బాధని చూడలేకపోతున్నాను" అని రాకుమారి అనడంతో ఇద్దరూ తాడుని వదిలారు. ఎద్దు రాకుమారి వద్దకు వెళ్ళింది. తరువాత రాకుమారి నోట్లో నుండి విసనకర్రని బయటకు తీసింది.



తరువాత ఆ చిన్న విసనకర్రని కొంత పెద్దగా చేసి చాంగ్ చేతికి ఇస్తూ, "దీని ద్వారా నీవు ముగించుకుని తిరిగి నాకు తెచ్చి ఇవ్వు" అంది. "దీన్ని ముందే నాకు ఇచ్చి వుంటే మీకు ఇన్ని కష్టాలు వచ్చేవా" అంటూ చాంగ్ దాన్ని తీసుకొని, "మాంగ్ మనకి కావలసినది దొరికింది. ఇక మనం అగ్నిపర్వతం వద్దకు వెళదాం పద" అన్నాడు. కొన్ని క్షణాల తరువాత ఇద్దరూ గాలిలో ఎగిరారు.

అతికష్టం మీద చాంగ్ అగ్నిపర్వతం పైకి చేరుకున్నాడు. విసనకర్రని గట్టిగా విసిరాడు. ఈ సారి ఆ మంటలు పూర్తిగా ఆరిపోయాయి. మరుక్షణమే ఎఱ్ఱగా వున్న ఆకాశం నల్లగా మారిపోయి మబ్బులు అలుముకున్నాయి. అదిచూసి చాంగ్ సంతోషపడుతూ మరోసారి విసనకర్రని విసిరాడు.







కొన్ని క్షణాల తరువాత వాతావరణంలో మార్పులు వచ్చాయి. చల్లని గాలులు వేగంగా వీయసాగాయి. అదిచూసి చాంగ్ ఇంకా సంతోషంతో ఆ విసనకర్రతో చాలాసార్లు విసిరాడు. మరక్షణం సన్నని జల్లులు ప్రారంభమయ్యాయి. శరీరంపై చల్లని చినుకులు పడడంతో అతనికి ఎంతో ఆనందమైంది. మరుక్షణం బోరున వర్షం కురియసాగింది. ఆ పర్వతం పూర్తిగా తడిసిపోయింది.

ఆ చుట్టుప్రక్కల గ్రామాల ప్రజలు వున్నట్టుండి వర్షం కురియడంతో ఆనందంతో ఇళ్ళల్లో నుండి బయటకి వచ్చి వర్షంలో తడవసాగారు. తాతయ్య సంతోషంతో "చాంగ్! ఆ విసనకర్ర సంపాదించినట్లున్నాడు. వాడివలన ఈ వర్షం వస్తోంది. ఇక ఈ గ్రామ ప్రజలు సంతోషంగా వుంటారు. ఇక చాంగ్ వచ్చిన వెంటనే మనం వెళ్ళిపోవాలి" అనుకున్నాడు. ప్రజలు అయన్ని ఎంతగానో మెచ్చుకున్నారు.





చాంగ్ చాలాసేపు వర్షంలో తడిసాక, "ఇక ఈ విసనకర్ర నాకెందుకు. ఆ రాకుమారికి ఇచ్చేస్తాను" అనుకొని గాలిలోకి ఎగిరి, క్షణంలో ఆ గుహని చేరి "రాజకుమారీ! నేను చెప్పినట్లు నా పని ముగిసిన తరువాత నీ విసనకర్రను తెచ్చి నీకు ఇచ్చేస్తున్నాను. ఇకపై ఇలాంటి పిచ్చిపనులు చేయకు" అన్నాడు. "చాంగ్! నా తప్పు తెలుసుకున్నాను. నీకు ఇది ఎప్పుడు కావాలంటే అప్పుడు నా వద్దకు రా ఇస్తాను" అంటూ సంతోషంతో చాంగ్‌ను సాగనంపింది.

ఆ తరువాత చాంగ్ తన తాతయ్య వద్దకు చేరాడు. అప్పటికే ఆ గ్రామ ప్రజలు ఆయన్ని చుట్టుముట్టి ఇక ఆ గ్రామం వదిలి వెళ్ళకూడదని ప్రార్థిస్తున్నారు. తాతయ్య వారికి నచ్చజెప్పి తన యాత్ర పూర్తికాలేదని తిరిగి వచ్చేటప్పుడు వారి గ్రామం వైపు వస్తానని వారికి నచ్చజెప్పి తన శిష్యులతో ముందుకు వెళ్ళాడు. గ్రామ ప్రజలు ఎడారి వంటి తమ పల్లెను స్వర్గసీమగా మార్చిన ఆ మహానుభావులకు జేజేలు పలికారు.

(అయిపోయింది)



మినీ నవల -

# దయ్యపు పెట్టె



విజయ్, శంకర్, కుమార్ - ముగ్గురూ స్నేహితులు. ముగ్గురూ కూడా పదవ తరగతి చదువుతున్నారు. ఒకసారి వారి స్కూలుకి వరసగా మూడు రోజులు శెలవులు వచ్చాయి. ఆ శెలవులు ఎలా గడిపితే బావుంటుందో- అని ముగ్గురూ చర్చించుకోసాగారు.

"చింతపల్లి అనే ఊరుంది గదా! అక్కడి కెళ్దాం!" అన్నాడు విజయ్. "అక్కడి కెందుకు?" ఆశ్చర్యంగా అడిగాడు కుమార్. "అక్కడ మా... ఓ పురాతన భవంతి వుందట, నేను కూ... ఎప్పుడూ చూడలేదు. సరదాగా చూడ...



కెళ్దాం?" అన్నాడు. "మీకు చింతపల్లిలో పురాతన భయవంతి వుందా? మరెప్పుడూ మాతో చెప్పలేదే? అలాంటిది చూడడమంటే నాకు భలే సరదా, రేపే వెళ్దాం!" అన్నాడు ఉత్సాహంగా కుమార్. "నాకు కూడా ఇప్పటి వరకు దాని గురించి తెలియదు. నిన్న మా నాన్నగారు ఎవరితోనో దాన్ని గురించి చెబుతుంటే విన్నాను!॥ అన్నాడు విజయ్.

"ఒద్దులేరా విజయ్! పురాతన భవంతుల్లో దయ్యాలుంటాయట! ఈ మధ్య మనం ఓ సినిమాలో చూడలేదా?" అన్నాడు శంకర్. "నోర్ముయ్! ఈ కాలంలో దయ్యాలేంటి?" కసురుకొన్నాడు కుమార్. "పురాతనమయినదే అయినా బాగా శిథిలమయి పోలేదట. ఆ భవంతి! రేపు వెళ్ళి రాత్రికి పడుకొని, మళ్ళీ ఎల్లుండి సాయంత్రాని కల్లా వచ్చేద్దాము సరేనా?" అన్నాడు విజయ్. శంకర్ అంగీకరించాడు.

మరునాడు అనుకొన్నట్టుగానే ఉదయమే బయలుదేరి మధ్యాహ్నానికల్లా చింతపల్లి చేరుకున్నారు. బస్సు దిగి చుట్టూ చూసారు. "అదిగో గుడి కనబడుతూంది, అది రామాలయమే కావచ్చు. దాని ఎదురుగనే మా భవంతి కెళ్ళే దారి వుందట రండి!" అంటూ ముందుకు అడుగు వేసాడు విజయ్.

రామాలయం చేరుకొని. దాని ఎదురుగా వున్న బాట గుండా ఓ అరమైలు దూరం నడిచారు. ఆ బాట చాలా సన్నగా వుంది. బాట కిరువైపులా పెద్ద పెద్ద వృక్షాలతో ఆ ప్రదేశమంతా అడవిలా వుంది. ఎక్కడా ఇల్లు అనేది లేదు. ఇంతలో దారి ఒడుపు తిరిగింది. ఆ ఒడుపు తిరగగానే "అదిగో భవంతి!" అంటూ ఉత్సాహంగా అరిచారు ముగ్గురూ.

రెండు అంతస్థులతో ఎత్తుగా విశాలంగా వుందా భవంతి; దాని చుట్టూ ఎత్తయిన ప్రహరీ గోడ వుంది. దానికి ఒకే ఒక పెద్ద ఇనుప గేటు వుంది. ముగ్గురూ కలిసి తోస్తే కిర్.... మని వికృతంగా శబ్దం చేస్తూ, తెరచుకుంది... లోనికి నడిచారు. ఎదురుగా సింహద్వారానికో పెద్ద తాళం వ్రేలాడుతుంది. విజయ్ తను తెచ్చిన తాళం చెవితో తాళం తీసాడు.



లోపల అన్ని గదులలో బూజుతో నిండి వున్నాయి. క్రింద నేలంతా అరంగుళం మందాన దుమ్ము పేరుకొని వుంది. మొత్తం పదహారు గదులున్నాయి. చెక్క మెట్ల ద్వారా పైకి ఎక్కారు. పైన కూడా పదహారు గదులున్నాయి. మొత్తం అన్ని గదులూ ఉత్సాహంగా తిరిగి చూసారు.

పైన ఒక గదిలో మాత్రం విశాలమైన పందిరి మంచం ఒకటి వుంది. దానిపై పరుపులు కూడా వేసి వున్నాయి. "ఎప్పుడయినా ఇక్కడకు వచ్చినపుడు ఉపయోగంగా వుంటుందని వుంచేసారనుకుంటూ, మనం ఈ రాత్రి దీనిపై హాయిగా పడుకోవచ్చు!" అన్నాడు విజయ్.

శంకర్ "నిజమే!" నంటూ కుమార్ కోసం ప్రక్కకు చూసాడు. కానీ, కుమార్ కనిపించ లేదు. "కుమార్... కుమార్" అంటూ కంగారుగా కేకలేసాడు శంకర్. ఇంతలో ప్రక్క గదిలోంచి, "ఏంటా అరుపులు నన్నేమయినా దయ్యం ఎత్తుకెళ్ళి పోయిందనుకొన్నావా?" అని శంకర్‌పై విసుక్కుంటూ వచ్చాడు కుమార్. అతని చేతిలో చెక్కపై అందంగా చిత్రించిన చిత్ర పటాలు వున్నాయి. "ఇవి నీ కెక్కడివి?" అన్నాడు విజయ్. "ప్రక్క గదిలో తగిలించి వున్నాయి, చాలా బాగున్నాయి, నాకివ్వవూ?" అన్నాడు కుమార్. కుమార్‌కు చిత్ర కళలో ప్రవేశం వుంది. మంచి మంచి చిత్రాలు సేకరించడం అతని హాబీ. అది తెలిసిన విజయ్ "సరే" అన్నాడు. కుమార్ ఆనందంగా వాటిని పదిలంగా క్రింద పెట్టి గుడ్డతో శుభ్రంగా తుడువ సాగాడు. ఆ చిత్రపటాలన్నీ ఎంతో అందంగా ప్రకృతి సౌందర్యాన్ని చిత్రించబడి వున్నవి. కాని ఒక్క చిత్ర పటం మాత్రం అందుకు విభిన్నంగా వుంది. "ఇలా చూడండి!



ఈ చిత్రం భలే గమ్మత్తుగా వుంది!" అన్నాడు కుమార్. ఇద్దరూ ఆ చిత్రం వైపు చూసారు.

ఆ చిత్రపటంపై రకరకాల నగిషీలు చెక్కిన ఓ పెట్టె చిత్రించబడి వుంది. ఆ పెట్టెకు పుర్రె ఆకారంలో గల ఓ తాళం వేసి వుంది. తాళంకు వుండే కన్నం చిత్రపటంపై నిజంగా వుంది.

"ఆశ్చర్యంగా వుందే! ఇక్కడ రంధ్రం ఎందుకు పెట్టారు?" అన్నాడు శంకర్. విజయ్ చిన్న పుల్ల ముక్క తీసుకొని ఆ రంధ్రంలో పెట్టి లోపలకు తోసాడు. చిన్న శబ్దంతో చిత్రపటం వెనుక వైపు నుండి అట్ట వూడి వచ్చింది; ఆ అట్టతో పాటుగా చుట్టగా చుట్టబడిన చిన్న చర్మం, ఓ ఇనుప తాళంచెవి వచ్చాయి.

విజయ్ ఆ చుట్టను విడదీసాడు. ఆ చర్మపు చుట్టలోని సగభాగం చెదలు తిని వేసింది. మిగిలిన సగంలో ఏదో వ్రాయబడి వుంది.

ముగ్గురూ అక్షరం అక్షరం కూడబలుక్కుంటూ దాన్ని ఇలా చదివారు. "ఈ గదికి క్రిందుగా నున్న గది క్రింద ఈ చిత్రపటంలో వున్న పెట్టె నిజంగా వుంది. అందులో... అంతవరకూనే వుంది మిగతా భాగం చెదలు తిని వేయడం వల్ల చదవడాన్కి కుదరలేదు. "అరె... అసలైన భాగం ఈ పాడు చెదలు తినేసిందే!" అన్నాడు కుమార్.

"ఈ గదికి క్రిందుగా నున్న గది క్రింద అంటే అర్థమేంటి?" అన్నాడు శంకర్. "ఈ గదికి క్రిందుగా నున్న గది అంటే క్రింద అంతస్తులో ఈ గదికి క్రింద నున్న గది. ఆ గది క్రింద అంటే... నేల మాళిగ అయ్యుంటుంది!" అన్నాడు విజయ్. "కరెక్ట్!" అన్నాడు కుమార్. "కానీ, ఆ పెట్టెలో ఏముంటుందో. ఎంత ఆలోచించినా అర్థం కావటం లేదు!" అన్నాడు విజయ్.





"ఆ పెట్టెలో ఏముంటుందో నా కర్థమయ్యింది!" అంటూ ఉత్సాహంగా అరిచాడు కుమార్. "ఏమిటి, ఏమిటి?" అంటూ అడిగారు. "నిధి... వజ్రాలు... రత్నాలు బంగారం. ఇవన్నీ ఆ పెట్టె నిండా వుంటాయి. విజయ్ పూర్వీకులు నిధిని అక్కడ దాచిపెట్టి, దాన్ని గురించి వ్రాసిన తోలు పట్టా, దాని తాళం చెవి ఈ చిత్రపటంలో తెలివిగా ఇరికించారు; ఎప్పుడయినా వాళ్ళ వాళ్ళకు దొరికెట్లుగా!" అన్నాడు కుమార్. "ఊఁ నిజమే!" అంటూ ఉత్సాహంగా అరుస్తూ చప్పట్లు కొట్టాడు విజయ్. "అయితే, ఇప్పుడు నేలమాళిగలోకి వెళ్ళి, ఆ పెట్టె తెరచి చూద్దాం!" అన్నాడు కుమార్. "వద్దు... నా మాట వినండి, ఆ పెట్టెకు వేసిన తాళం పుర్రె ఆకారంలో ఉన్నట్లుగా ఈ బొమ్మలో వేసారు. దీన్ని బట్టి చూస్తుంటే, ఆ పెట్టెలో ఏదైనా దయ్యాన్ని..." అతని వాక్యం పూర్తి కాకమునుపే కసురుకొన్నాడు విజయ్.

"దయ్యాన్నయితే ఇంటిలో ఎందుకు పెట్టుకుంటార్రా? ఏ శ్మశానంలోనో కప్పెడతారు గాని, అయినా, ఇంకా ఈ కాలంలో నీకింకా మూఢ నమ్మకాలేంట్రా; మొత్తానికి ఆ పెట్టెలో ఏదో విలువైనదే వుండి వుంటుంది. అదేంటో మనం ఇప్పుడే చూడాలి పదండి!" అన్నాడు.

అప్పుడు సమయం రాత్రి ఏడు గంటలు. ఆ భవనానికి కరెంటు లేదు. కాని, కొవ్వొత్తుల గుచ్చాలు చాలా వున్నాయి. శంకర్ ఓ వెలుగుతున్న క్రొవ్వొత్తుల గుచ్ఛం పట్టుకొన్నాడు. చెక్క మెట్ల గుండా క్రిందకు దిగారు. ఆ గదికి క్రిందగా నున్న గదిని చేరుకొన్నారు.

ఆ గది మిగతా అన్ని గదుల కన్నా అధ్వాన్నంగా వుంది. విరిగిపోయిన కుర్చీలు మొదలైన వాటితో నిండి వుంది. ఆ సామానంతా ఆ గదిలోంచి తొలగించి, క్రొవ్వొత్తుల గుచ్చాన్ని గదికి మధ్యలో పెట్టి నేలమాళిగకు



దారి కోసం నేల అంతా తడుముతూ తనఖీ చేయసాగారు. ముగ్గురి బట్టలూ చెమటకు తడిసి ఒంటికి అతుక్కు పోయాయి. కొంచెం సేపటికి "దొరికింది నేలమాళిగకు దారి!" అంటూ ఉత్సాహంగా అరిచాడు విజయ్. ఒక్క గెంతుల్లో ఇద్దరూ అక్కడకు చేరుకున్నారు.

ఆ గది నేలంతా నాపరాయి పరిచి వుంది. గదికి ఉత్తరం వైపుగా వుంది మనిషి పట్టేటంత నాపరాయి ఒక్కటి. దానికి ఓ ప్రక్క ఆ రాయికి మధ్య వేళ్ళు పట్టేంత ఖాళీ వదిలి వేయబడి వుంది. ముగ్గురూ ఆ ఖాళీలో చేతులు పెట్టి రాయిని పైకెత్తేసారు. క్రిందకు మెట్లు కనిపించాయి. ముగ్గురూ ఒకరి తర్వాత ఒకరుగా మెట్ల వెంబడి క్రిందకుదిగారు.

పై గదంతా నేలమాళిగగావుంది. విపరీతమయిన బూజుతో, దుమ్ము దూళితో, ఎప్పుడు గాలి వెళ్లని కారణంగా, అదో రకమయిన కంపుతో అసహ్యంగా వుంది గది. బాగా పాతబడిన బీరువాలు కొన్ని గోడలకు జారగిల బెట్టబడి వున్నాయి. ఆ గదికి మధ్యలో వుంది ఆ పెట్టె. దాదాపు ఎనిమిది అడుగుల పొడవుతో, చుట్టూరా నగిషీ చెక్కడాలతో, ధృఢంగా నిర్మించబడి వుంది. మెల్లగా పెట్టెను సమీపించారు. శంకర్ క్రొవ్వొత్తుల గుచ్ఛం దగ్గరకు పట్టగా, పుర్రె ఆకారంతో వున్న దాని తాళం కప్పును చూచేసరికి ముగ్గురికీ కొంచెం భయం కలగసాగింది. మెల్లగా విజయ్ వణుకుతున్న చేతులతో రంధ్రంలో తాళంచెవి దూర్చాడు.

అప్పుడే పెద్ద పెద్ద ఉరుములు. మెరుపులతో బయట వర్షం ప్రారంభమైంది. కాని ఆ వర్షం ఆ భవనం పరిసర ప్రాంతాల్లో తప్ప ఎక్కడా కురవడం లేదు. విసురైన ఈదురుగాలులతో కూడిన ఆ వర్షంను చూస్తే





ఎవరికైనా భయం కలిగేట్లుగా వుంది. బయట అంత భీభత్సంగా వున్నా, నేలమాళిగలో వుండడం వల్ల వాళ్లకు ఏం తెలియడం లేదు.

మెల్లగా తాళం చెవి త్రిప్పాడు విజయ్. చిన్న శబ్దంతో తెరుచుకొంది తాళం. గడియ పైకెత్తి మూత తెరవబోయాడు. కాని, ఒక్కడి వల్లా సాధ్యం కాలేదు. కుమార్ కూడా చేయి వేసాడు.

గుర్... ర్ అనే శబ్దంతో మూత తెరచుకొంది. ఆతృతగా క్రొవ్వొత్తుల గుచ్ఛాన్ని దగ్గరగా పెట్టి, లోనికి చూచిన శంకర్ "కెవ్వు" మంటూ అరిచాడు. లోపలకు చూచిన విజయ్, కుమార్‌లు కూడా బిగుసుకు పోయారు.

పెట్టె లోపల సగం వరకూ ఎర్రటి రంగులో ఏదో ద్రవం; ఆ ద్రవంలో దాదాపు ఏడడుగుల పొడవున్న అస్థిపంజరం లీలగా కన్పిస్తోంది.. క్రమంగా ఆ ద్రవం గట్టిపడి అస్థిపంజరానికి అంటుకోసాగింది.

విజయ్ తేరుకొని ఇద్దరి చేతులను పట్టుకొని ఓ బీరువా చాటుకు తీసుకు పోయాడు. అక్కడి నుండి గుండెలనరచేతిలో పెట్టుకొని పెట్టెవైపు చూడసాగారు.

ఇంతలో పెట్టెలో నుండి "గుర్... ర్" మంటూ ఓ వికృతమైన శబ్దం రాసాగింది. మెల్లగా ఓ చేయి వచ్చి పెట్టె అంచును పట్టుకొంది. ఆ చేయి... ఎర్రగా, పసుప్పచ్ఛగా చీము నెత్తురు కలిసిన రంగులో వుంది,



తరువాత ఓ కాలు నేలకు ఆనించిన తర్వాత పెట్టలోంచి మొత్తం ఆకారం బయటకు వచ్చింది.

ఆ ఆకారాన్ని చూడగానే శంకర్ కెవ్వుమని అరవబోయాడు. కాని, అరుపు గొంతు దాటి బయటకు రాలేదు. ముగ్గురూ గడ గడా వణికి పోసాగారు. ఆ ఆకారం ఏడడుగుల పొడువుతో ఒళ్లంతా గుంటలతో భీకరంగా వుంది. ముఖం ఇంకా భీకరంగా వుంది. పెద్ద పెద్ద కళ్లు ఎర్రగా గుండ్రంగా వున్నాయి. ముక్కు స్థానంలో ఓ గుంట, బండగా రక్తం స్రవిస్తున్న దాని పెదాల వెంబడి చురకత్తుల్లా రెండు కోరలు ఆ చిరు వెలుగులో తళుక్కున మెరుస్తున్నాయి. ఆ ఆకారం నుండి విపరీతమైన దుర్వాసన రాసాగింది. అది వీళ్ల వైపు చూడలేదు. దాని



చూపు నేలమాళిగ తలుపు వైపే వుంది. "గుర్... ర్" మంటూ మెట్ల వెంబడి పైకెళ్ళి పోయింది.

గుర్... ర్ మనే శబ్దం దూరమయ్యేవరకూ అక్కడే వుండి, తరువాత తడబడే అడుగులతో పైకి చేరుకొన్నారు. అక్కడి నుండి కిటికీ గుండా బయటకు చూసారు. అప్పటికే అది ప్రహరీ గేటు దాటుకొని కుడివైపుకు పెద్ద పెద్ద అంగలు వేసుకొంటూ వెళ్లిపోయింది.

"నేను ముందే చెప్పానా- అందులో ఏదో దయ్యం వుంటుందని!" ఏడుపు గొంతుతో అన్నాడు శంకర్.

"అలా బయట కెళ్ళిపోయిందేమిటి? ఏం జేస్తుందంటావ్?" అడిగాడు విజయ్ కుమార్‌ను.

"నా దృష్టిలో అది ఏ రక్త పిశాచమో అయి వుంటుంది. రక్త పిశాచాలేం చేస్తాయి మనుషుల రక్తాన్ని త్రాగుతాయి" అన్నాడు కుమార్. "అయ్య బాబోయ్!" అన్నాడు శంకర్ వణుకుతూ. "అయితే, మనం తక్షణం ఇక్కడి నుండి వెళ్ళి పోవాలి" అన్నాడు విజయ్. "బాబోయ్! నేను రాను, ఇప్పుడు మనం బయట కెళ్లామంటే దాని కంట పడతాం; అలా జరిగితే ఇంకేమన్నా వుందా?" అన్నాడు శంకర్. "ఫరవాలేదు; అదృష్టవశాత్తు అది కుడివైపు వెళ్లింది. వూరికి దారి ఎడమవైపు వుంది కదా..." అన్నాడు విజయ్. "నిజమే విజయ్, నీవు చెప్పిన మాట నిజం. అదీకాక రక్త



పిశాచాలు వెలుగును చూడలేవు. తెల్లవారిం తర్వాత ఎక్కడ వున్నా ఆ రక్తపిశాచి తప్పనిసరిగా ఈ భవనం దగ్గర కొచ్చేస్తుంది!" అన్నాడు కుమార్.

"బాబోయ్, మళ్లీ ఇక్కడి కొచ్చేస్తుందా?" అన్నాడు వణుకుతూ శంకర్.

"ఖచ్చితంగా వస్తుంది. ఈ లోగా మనం మన ఊరికి పారిపోవాలి!" అన్నాడు విజయ్. ముగ్గురూ రామాలయం వైపు పరుగెత్తారు. ఆ కంగారులో ఇంటి ముఖద్వారానికి తాళం వేయాలని గానీ, అలా చేసినట్లయితే రక్త పిశాచికి ఆ భవంతిలోకి రావడానికి అంత వీలిక కాకపోవచ్చునని గాని ఆలోచన పట్టలేదు ఎవ్వరికీ.

ఎక్కడా ఆగకుండా ఒగర్చుకొంటూ రామాలయం చేరుకొన్నారు. ఇంకా భయం తీరలేదు. ముగ్గురికీ కూడా కాళ్ళూ, చేతులూ వణుకు తున్నాయి. "టైమెంతయింది?" అడిగాడు శంకర్ కుమార్‌ను. "పదికా వస్తూంది. అన్నట్లు ఇప్పుడు ఇంత రాత్రివేళ మన వూరికి బస్సులేం వుండవు మరెలా వెళ్ళాలి?" అన్నాడు కుమార్. "దేవుడి దయవల్ల మన వూరివైపు వెళ్ళే లారీ వస్తే, మనం క్షేమంగా వూరు చేరుకోగలం!" అన్నాడు విజయ్. "అదిగో, దూరం నుండి ఏదో లారీ వస్తూంది-దాన్ని ఆపుదాం!" అన్నాడు శంకర్. చేతులడ్డంగా పెట్టి ఆపమంటూ అరిచారు. లారీ







వీరి ప్రక్కగా ఆగింది. "ఏ వూరెళ్లాలి?" అన్నాడు డ్రైవర్. వీళ్ల వైపు ఎగా దిగా చూస్తూ వారు చెప్పారు. అదృష్టవశాత్తు అటువైపే వెళ్తుంది లారీ. ముగ్గురూ ఎక్కేసారు. లారీ వేగంగా దూసుకు పోయింది.

అర్ధరాత్రి రెండు గంటలకు వచ్చి తలుపు తట్టిన విజయ్‌ను చూచి వాళ్ళమ్మగారు ఆశ్చర్యపోయారు.

ఆ మరునాడు కుమార్ శంకర్‌ల దగ్గర కెళ్లడాన్కి తయారవుతుండగా విజయ్ నాన్న గారు... "ఒరేయ్ విజయ్, మీరు నిన్న రాత్రి చింతపల్లి నుండి బయల్దేరి వచ్చేయడమే నయమైందిరా! నిన్న రాత్రి అక్కడ నాలుగు హత్యలు జరిగాయట. ఇదిగో ఈ పేపర్‌లో వేసారు!"

పేపర్ తీసుకొని కుమార్, శంకర్‌లని కలవాలని బయల్దేరాడు.

ముందుగా కుమార్ ఇంటికి చేరుకొన్నాడు విజయ్. శంకర్ కూడా అక్కడే వున్నాడు. విజయ్ పేపర్ వాళ్ల ముందు పరచి ముందు ఈ వార్త చదవండి అన్నాడు. ఇద్దరూ పేపర్‌పై దృష్టి సారించారు.

"స్థానిక చింతపల్లి గ్రామంలో నిన్న తెల్లవారు జామున నాలుగు శవాలు పొలంలో పడి వుండడం గ్రామస్తులు కనుగొన్నారు. నలుగురూ ఒకేరీతిన పీక కొరికి వేయబడి చంపబడడం విశేషం. ఈ నలుగురూ వూరికి కొంచెం దూరంగా పొలాలకు కాపలా వున్న వారేనట! ఈ హత్యలు అర్ధరాత్రి దాటిం తర్వాత జరిగినట్లుగా భావిస్తున్నారు. ఈ భయంకర హత్యలకు గ్రామస్తులు విపరీతంగా భయపడుతున్నారు!" అని వుంది.

అది చదివిన కుమార్, శంకర్‌ల ముఖాలు పాలిపోయాయి. "సందేహం లేదు, ఇది రక్త పిశాచి పనే!" అన్నాడు కుమార్ వణకుతున్న కంఠంతో. తాము చేసిన తప్పుడు పనివల్లే, పాపం తెలియని గ్రామస్తులు అన్యాయంగా బలి అవుతున్నారని, తమలో తాము బాధపడ సాగారు. చివరికి, ఆ రక్త పిశాచిని అంతమొందించాలన్న నిర్ణయంతో ముగ్గురూ చింతపల్లి బయల్దేరారు. చీకటిపడే సమ



యానికి భవనం చేరుకొన్నారు. నేలమాళిగ పైన నాపరాయిని మూసి, దాని మీద బీరువా పెట్టి, దగ్గరలో దాగి చూడసాగారు.

అర్థరాత్రయింది. ఇంతలో పెద్ద శబ్దంతో నాపరాయి, బీరువా వెనక్కు విరుచుకు పడ్డాయి. గుర్... ర్ అంటూ వికృతంగా అరస్తూ పైకి వచ్చింది రక్త పిశాచి. ముగ్గురూ దాని కంట పడకుండా చాటుకు తప్పుకొన్నారు. అది పెద్ద పెద్ద అంగలు వేసుకొంటూ బయటకు వెళ్ళిపోయింది.

ముగ్గురూ ఉస్సురుమంటూ క్రింద కూలబడ్డారు. అప్పుడు "నాకో ఆలోచన వచ్చింది!" అన్నాడు విజయ్ ఎంతో ఉత్సాహంగా. "ఏమిటి? అన్నారు ఇద్దరూ ఒక్కసారిగా. మనం "రామాలయం దగ్గర్లో కబేళా చూసాం కదా! అక్కడి కెళ్ళి ఏదో విధంగా రక్తం సంపాదించుకొచ్చి, రక్తపిశాచి వచ్చేంతలో పెట్టెలో పోయాలి, అది వాసనకు పెట్టెలోకి వస్తుంది, శంకర్ నువ్విక్కడే వుండు, మేము వెళ్లి తీసుకొస్తాం!" అంటూ బయల్దేరారు విజయ్, కుమార్‌లు.

కబేళా చేరుకొన్నారు. అక్కడ ఎవ్వరూ లేదు చుట్టూ చూసారు. ఒక మూల సగం వరకూ రక్తంతో నింపబడిన ఒక్కెట్టు కనబడింది. దాన్ని తీసుకొని పరుగెత్తుకుంటూ భవనాన్ని చేరుకొన్నారు. ముగ్గురూ కలసి నేలమాళిగలోకి దిగారు. విజయ్ బక్కెట్టులోని రక్తాన్ని పెట్టెలో పోసాడు. "శంకర్, నీవు ఆ పెట్టె వెనుకే నక్కి కూర్చో. నేను శంకర్ అని అవరగానే తెరిచి



వున్న పెట్టె మూతను మూసెయ్, అంతే!" అన్నాడు. శంకర్ తల వూపి పెట్టె చాటున నక్కాడు; విజయ్, కుమార్‌లు బీరువా చాటున వున్నారు.

అర్ధరాత్రి దాటింది. 'గుర్...ర్' మనే శబ్దంతో మెట్లు దిగి రాసాగింది. దాని కోరంతా రక్తంతో తడిసి భయంకరంగా వుంది, దానికి రక్తం వాసన ముక్కుకు తగిలినట్టుంది. అది పెట్టె దగ్గరకు నడచి వెళ్ళి పెట్టెలోకి తొంగి చూచింది. దాని కళ్ళు మెరిసాయి. వెంటనే పెట్టెలో దిగి దోసిళ్ళతో పట్టి రక్తం త్రాగసాగింది.

అదే సమయమనుకొని విజయ్, కుమార్‌లు దాని వెనక్కు జేరారు. ఒకరి నొకరు

సైగలు చేసుకొని దాని నడుంపై చేతులు అదిమి వేసి "జై శంకర్" అని తోసేసారు. వికృతంగా అరుస్తూ చేతిని బయటికి చాచి కూలబడింది. శంకర్ వెంటనే తలుపును తోసేసాడు. తలుపు చేతికి తగలగడంతో, రక్తపిశాచి బలంగా మూత తెరవసాగింది. అంతలో విజయ్ సైగ నందుకున్న శంకర్, కుమార్ పెట్టె మీదకు ఎక్కేసారు. విజయ్ చుట్టూ చూసాడు. మూలగా ఓ పలుగు కనపడింది. దేవుణ్ణి స్మరించుకొని బలమంతా ఉపయోగించి దానితో చేతిపై ఒక్క పోటు పొడిచాడు. అంతే, చేయి లోపలికెళ్లిపోయి, తలుపు గడియ పడింది. విజయ్ వెంటనే తలుపుకు తాళం వేసి త్రిప్పాడు. తాళం చెవి చేతి కొచ్చేసింది. శంకర్, కుమార్‌లు పెట్టె దిగి విజయ్ ప్రక్కకొచ్చారు. కొంచెంసేపు పెట్టె ఊగింది. క్రమంగా నిశ్చలంగా వుండి పోయింది.

ముగ్గురూ తృప్తిగా నిట్టూర్చి పైకొచ్చి సాపరాతిని జరిపి, నేలమాళిగను మూసేసారు. భవనం బైటకొచ్చి ముఖద్వారానికి కూడా తాళం వేసేసారు. ముగ్గురూ రామాలయం వైపు నడవసాగారు. "ఆ దయ్యపు పెట్టె తాళం చెవిని ఏం చేద్దాం?" అన్నాడు కుమార్. "రేపు ప్రొద్దుటే కమ్మరి దగ్గర కెళ్ళి ఈ తాళం చెవిని యిచ్చి కొలిమిలో వేసి బాగా కరగబెట్టించేద్దాం!" అన్నాడు విజయ్.

"అమ్మయ్యా! మనం చేసిన తప్పును సరి చేసాం; నిజంగా ఈ రోజు మనకి ఇంత ధైర్యం ఎలా వచ్చిందో... అంతా దేవుడిదయ; లేకుంటే అన్యాయంగా ఈ గ్రామ ప్రజలు ఆ రక్తపిశాచికి బలి అవుతుండేవాళ్లు. అయినా ఇలాంటి సాహసాలు ఎప్పుడూ చేయకూడదు" అన్నాడు విజయ్. అంతలో అటుగా వచ్చిన లారీని ఆపి ముగ్గురూ ఎక్కారు.







# గర్వ భంగం

అరుణాపురానికి, అన్నవరానికి మధ్య అగ్రహారం అనే చిన్న గ్రామం ఉండేది, దానికి 'పండితుల గ్రామం' అనే మరో పేరు కూడా ఉండేది. కారణం - ఆ ఊరిలో పండితులు ఎక్కువగా నివసిస్తూ ఉండేవారట! ఆ ఊరిలో పండితులు తాము చాలా తెలివిగల వారమని గర్వపడటమేగాక, పక్క గ్రామాల వారిని చాలా చులకన భావంతో చూస్తూండేవారు.

అరుణాపురానికి చెందిన సోమశేఖరం అనే యువకుడు వ్యాపారం నిమిత్తం అన్నవరానికి ప్రయాణిస్తూ, ఎండ తీవ్రంగా ఉండడం వల్ల అగ్రహారంలో ఓ చెట్టుక్రింద కూర్చొని విశ్రాంతి తీసుకొంటున్నాడు.

ఇంతలో ఆ గ్రామంలోని ఇద్దర
పండితులు పరస్పరం వాదించుకొంటూ,
చెట్టు క్రిందికి వచ్చారు. వాళ్ల వాదన
పరసరాలను మరిచిపోయి, పెద్దగా అరు
కోవడం - ఆ చెట్టుక్రింద కూర్చొని ఉ
సోమశేఖరంకి విసుగుగా తోచింది. అయినా
కొంతసేపు సహించాడు. వాళ్ల వాదన ఎంత
ఆగక పోవడంతో, "చుట్టు ప్రక్కలవా
ఇబ్బందిని గమనించనక్కరలేదటయ్యా, కా
చిన్నగా మాట్లాడొచ్చుగదా! పండితులైనం
మాత్రాన గొప్ప కాదు, కాస్తో కూస్తో తెలివి
ండాలి!" అని విసుక్కున్నాడు.

ఆ మాటలతో పండితులక్కోపమొ
"ఏమయ్యా? మేము తెలివిలేని వాళ్ళమా? ను
మహా తెలివి గలవాడవా? మే మెవరి

ఎ. రమ, నెల్లూరు

తెలుసా? సాక్షాత్తూ రాజస్థానంలోని పండితులం. నువు మమ్ములను దూషించి నందుకు తప్పకుండా శిక్షననుభవిస్తావ్; లేదా మాతో ఏదయినా పందెం కాసి, మేము తెలివి తక్కువ వాళ్ళం - అని నిరూపించు!" అంటూ మండి పడ్డారు - పండితులిద్దరూ సోమశేఖ రానికి గొంతులో పచ్చి వెలక్కాయ పడ్డట్ట యింది. "ఇదెక్కడి కర్మరా బాబూ!" అని తన దురదృష్టాన్ని తానే నిందించుకొంటూ, "రాజు చేత శిక్షింప బడటం కంటే వీళ్ళతో పోటీ పడటమే మేలు!" అని తలచి, పోటీకి ఒప్పుకొన్నాడు. అప్పుడు ఆ పండితులు పోటీ వివరించడం మొదలు పెట్టారు.

"ఇదిగో ఆ చెట్టుకి కాస్త దూరంగా ఎవరో ప్రయాణీకులు కూర్చొని అన్నం తిన్నట్టు, కాస్త అన్నం మెతుకులు, అరటి ఆకులు గందరగోళంగా పడి ఉన్నాయ్. అక్కడ ప్రయాణీకులు ఎన్ని గంటలకి అన్నం తిన్నారు? అక్కడికి కాస్త దూరంగా విశ్రాంతి తీసుకోడాన్కి అన్నట్లు శుభ్రపరచి ఉంచారు. వారు అన్నం తిన్న ఆ ప్రదేశంలోనే విశ్రాంతి తీసుకోవచ్చుగా? వేరే స్థలాన్ని ఎంచుకోవడాన్కి కారణమేమిటి?" అని ప్రశ్నించాడొక పండితుడు. "ఈ ప్రశ్నకు సమాధానం ఇవ్వడాన్కి రేపు మధ్యాహ్నం వరకూ నీకు సమయ మిస్తున్నామని పోయావా రాజాస్థానానికి ఈడ్చుకెళతాం అని చెప్పి వారి పాలేర్లను కాపలా ఉంచి వెళ్ళిపోయారు.

సోమశేఖరం అక్కడ పడి ఉన్న అన్నం మెతుకులనూ, పరిసరాలను పరిశీలించాడు. రాత్రి అయింది. అక్కడే నిద్ర పోయాడు.

మరునాడు సమయం 11 గంటలయింది. చెట్టు నీడ సరిగ్గా అన్నం మెతుకులు పడి ఉన్న స్థలంపై పడింది. అంతే! సోమశేఖరం మనసులో చప్పున ఓ ఆలోచన మెదిలింది. వెంటనే పండితులను పిల్చి, "నిన్న సరిగ్గా 9 గంటలకు ప్రయాణీకులు ఇక్కడ అన్నం తిన్నారు, తినేసరికి నీడ వారిని దాటి కాస్త కాస్త పొట్టిగా తయారైంది. అందుకే నీడలో శుభ్రపరచి, విశ్రాంతి తీసుకొన్నారు" అన్నాడు. అంతే! పండితులకు గర్వభంగమయింది. వారు అప్పటి నుండి గర్వపడటం మానేసారు.







# అబద్ధమాడిన గురువు

కాశ్మీర రాజ్యంలో ఒక ఆశ్రమం ఉండేది. అక్కడ విద్యానందస్వామి అనే గురువు తన శిష్యులతో వుండేవాడు.

ఒక రోజు విద్యానందస్వామి తన శిష్యులందరినీ తన దగ్గరకు పిలిచి, "వచ్చేవారంలో వస్తున్న నా పుట్టిన రోజును జరుపుకోవాలనుకుంటున్నాను. కానీ నా పుట్టిన రోజును జరుపుకోడానికి నా దగ్గర ఒక్క పైసా కూడా లేదు" అన్నాడు.

ఇది విన్న కొంత మంది శిష్యులు "గురువర్యా, మేము మా తల్లిదండ్రులను డబ్బు అడిగి తెస్తాము. మీరు పుట్టిన రోజును జరుపుకోండి!" అని అన్నారు.

కానీ అందుకు విద్యానందస్వామి సమ్మతించక, "మిమ్మల్ని డబ్బు అడిగితే, నేను పిసినారిని అవడంచేత. మిమ్మల్ని డబ్బు అడుగుతున్నాను అని మీ తల్లిదండ్రులు అనుకుంటారు. వారు అలా అనుకోవడం నాకు ఇష్టం లేదు!" అని అన్నాడు విద్యానందస్వామి తన శిష్యులతో.

గురువుగారు చెప్పింది విన్న శిష్యులు మౌనంగా వుండిపోయారు. కొంత సేపైన తర్వాత విద్యానందస్వామి ఆలోచించి, తన శిష్యులతో- "మీరందరూ డబ్బు తీసుకురండి. కానీ మీ తల్లిదండ్రులను అడిగి తీసుకు రాకండి, ఎవరికీ తెలీకుండా దొంగతనంగా తీసుకు రండి!" అని చెప్పాడు.

గురువుగారు చెప్పినట్లు శిష్యులందరూ తాము దొంగిలించి తెచ్చిన డబ్బును గురువుగారికి సమర్పించసాగారు. ఆ డబ్బును గురువుగారు స్వీకరించారు.

కె. నరసింహ, *కరీంనగర్*

కానీ, విద్యానందస్వామికి ఒకే ఒక శిష్యుడు తన తండ్రి ధనవంతుడైనను వట్టి చేతులతో రావడం కనిపించింది.

విద్యానందస్వామి ఆ శిష్యుడిని దగ్గరికి పిలిచి కోపంతో "నువ్వు నీ గురువుగారికి డబ్బు తేలేదా?" అని అడిగాడు.

తేలేదని తల ఊపాడు- ఆ శిష్యుడు మౌనంగా.

విద్యానందస్వామి ఆ శిష్యుని మీద కోపంతో "గురువు మాటను కూడా నువ్వు వినలేదన్న మాట!" అని అన్నాడు.

"లేదు గురువర్యా, మీరు చెప్పినట్లు నేను మీకు డబ్బును తెచ్చివ్వలేక పోయినందుకు నన్ను క్షమించండి, మరలా తమరు నన్ను దొంగిలించమని చెప్పరని అనుకుంటున్నాను! మీరే నాకు ఎన్నోసార్లు "దొంగలించరాదు; దొంగతనం చేయడం పాపం" అని చెప్పారు. చివరికి మీరే దొంగలించమని చెప్పి పంపడం అన్యాయం కాదా? అందుకు నా మనసు అంగీకరించలేదు; మీ పుట్టిన రోజుకు, మా తలిదండ్రులను అడిగి తీసుకుమ్మని చెప్పివుంటే, గౌరవ మర్యాదలతో విలువైన కానుకలు తెచ్చి సమర్పించుకొనేవాడ్ని" అంటూ విద్యానంద స్వామి కాళ్లమీద పడ్డాడు ఆ శిష్యుడు.

శిష్యుడు చెప్పింది విన్న విద్యానందస్వామి తన శిష్యుడిని లేవనెత్తి కౌగిలించుకుని, "నువ్వే నా నిజమైన శిష్యుడివి. నేను చెప్పినా నువ్వు పాప మార్గాన్ని అనుసరించలేదు" అని అక్కడ వున్న ఆ శిష్యుల వంక చూసి, "శిష్యులారా! నా నిజమైన శిష్యుడ్ని ఎన్నుకోడానికే, నా పుట్టిన రోజని మీకు అబద్ధం చెప్పాను. అంతేకానీ, నాకు డబ్బుతో అవసరం లేనేలేదు. మీరు తెచ్చిన డబ్బును మీరు తీసుకుపోండి. నాకు నిజమైన శిష్యుడిని ఎన్నుకోవాలని వుంది. ఇప్పుడు నాకు నిజమైన శిష్యుడు దొరికి పోయాడు!" అని విద్యానందస్వామి చెప్ప డంతో, అక్కడ వున్న శిష్యులందరూ సిగ్గుతో తలలు దించుకుని అక్కడి నుండి వెళ్లిపోయారు.





# వసంత మండపం



అది సాయంత్ర సమయం. ఆకాశ మంతా దట్టమైన మేఘాలు భాస్కరుని మరుగు పరుస్తున్నాయి. మెల్ల మెల్లగా చీకటి పడసాగింది. ఆ సమ యంలో ఒక వ్యక్తి ఎందుకో అతివేగంగా భయపడుతూ, వెనుకకు చూస్తూ పరిగెత్తుతున్నాడు. అతన్ని ఎవ్వరూ వెంటాడటం లేదు. మరి ఎవరికి ఎందుకు భయపడి అతను పరిగెత్తు తున్నాడు? అతని శరీరం చెమటతో ముద్దగా తడిసిపోయి వుంది. అతను చాలా దూరం నుండి పరిగెత్తడం వల్ల బాగా అలసిపోయాడు, శక్తి సన్నగిల్లింది. అయినా, అతను ఎక్కడా ఆగనూ లేదు; కూర్చొననూలేదు. అలాగే శ్రమతో పరిగెత్తుతూ నగరానికి వెలుపల వున్న పెద్ద గుడిసెలో దూరాడు.

బి.ఆర్. వరదరాజులు, మద్రాసు



"ఏమండీ! ఏమిటలావున్నారు? చెమటలు పోసుకుంటూ ఎందుకు పరిగెత్తుకొచ్చారు?" అని ఆతృతతో లోపలున్న అతని భార్య లక్ష్మి ప్రశ్నించింది.

ఆ వ్యక్తి అక్కడున్న నవారు మంచం మీద కూర్చుని ఆయాసపడుతూ, "లక్ష్మీ! మనకు అపాయం రాబోతూంది. మనం త్వరగా ఈ గుడిసెను వదలి ఎక్కడికైనా పారిపోవాలి; లేకుంటే మన ప్రాణాలకే ముప్పు కలుగుతుంది!" అన్నాడు.

"మనకు అపాయమా? ఎందుకు? అసలు ఏం జరిగిందో వివరంగా చెప్పండి!" అన్నది లక్ష్మి.

"చెబుతాను లక్ష్మీ, నేను రాజుగారి ప్రధాన సేవకుడ్ని కదా! రాజుగారి ప్రాణం కాపాడడానికి నా ప్రాణం ధారబోస్తానన్న సంగతి నీకు తెలుసుకదా! ఈ రోజు ఉదయం రాజుగారిని చంపడానికి ఏదో పథకం వేసుకుంటున్న కోశాధికారి 'హిమకేతుడు', అతని మిత్రులను నేను చూశాను, వారి మాటలను విన్నాను. వెంటనే రాజుగారి వద్దకు వెళ్లి అంతా చెప్పేశాను. రాజుగారు వెంటనే హిమకేతుడ్ని, అతని మిత్రులను బంధించి చెఱసాలలో వేయించారు.

చెఱసాలకు వెళ్లేటపుడు హిమకేతుడు నన్ను చూసి, "వజ్రదత్తా! నన్ను చెఱసాలకు పంపించానని ఆనందపడకు; నా సంగతి నీకు తెలియదు. ఈ రాత్రిలోగా నిన్నూ, నీ కుటుంబాన్ని నాశనం చేయకపోతే- నా పేరు హిమకేతుడు కాదు!" అని వీరావేశంతో అరచి చెఱసాలకు వెళ్లిపోయాడు.

నేను అది పట్టించుకోలేదు. సాయంత్రమైంది. నా ఉద్యోగ ధర్మం నెరవేర్చి ఇంటికి రావాలని బయలుదేరుతూండగా నా మిత్రుడు పరిగెత్తుకొచ్చి, హిమకేతుడు, అతని మిత్రులతో చెఱసాల నుండి పారిపోయాడని చెప్పాడు.

అంతే! అది వినడంతో, నాకు ఉదయం హిమకేతుడు చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి. అంతే! అక్కడి నుండి వేగంగా పరిగెత్తుకొచ్చాను!" అని ఆగాడు వజ్రదత్తుడు.



"అంటే మిమ్మల్ని చంపడానికి హిమకేతుడు ఇక్కడికి వస్తాడని భయపడుతున్నారా?" అన్నది లక్ష్మి.

"అవును, వాడు పాములాంటివాడు. పగపట్టాడంటే చివరవరకు వదలడు. మిగతా విషయాలు తరువాత తీరికగా మాట్లాడుకుందాం! ముందు మూటా ముల్లె సర్దు. మనం వెంటనే ఈ నగరం వదలి వెళ్లిపోవాలి. అన్నట్టు మన బాబు కిషోర్ ఏడీ?" అనడిగాడు.

"ఇప్పుడే బయటికి వెళ్లాడు. మనం అంతా సర్దుకునేంతలో వచ్చేస్తాడు. మీరు కాసేపు విశ్రాంతి తీసుకోండి!" అంటూ లోపలికి వెళ్లింది లక్ష్మి.

అలసటతో వున్న వజ్రదత్తుడు మెల్లగా కళ్లు మూసుకుని ఆలోచించసాగాడు. గుడిసె తడిక తీసుకుని ఎవరో వస్తున్న శబ్దం విని లేచి, "బాబూ కిషోర్! త్వరగా తయారవ్, మనం ఈ నగరం వదలి వెళ్లిపోవాలి!" అన్నాడు.

"మమ్మల్ని వదలి అంత త్వరగా వెళ్లిపోతున్నావా వజ్రదత్తా!" అంటూ లోపలికి అడుగుపెట్టాడు. హిమకేతువు మిత్రులతో.

వారిని చూడడంతో వజ్రదత్తుడు, "ఆఁ... మీరా! ఎందుకు వచ్చారు?" అనరిచాడు తొందరపాటుతో.

"మేం ఎవరో ఎందుకు వచ్చామో నీకు తెలుసు, కాని తెలియనట్టు నటిస్తున్నావే?



అంతేనా? విను, మేము పగపట్టిన పాములం, సరాంతకులం, పగతీర్చుకోడానికి వచ్చాం!" అన్నాడు హిమకేతువు.

సరిగ్గా ఆ సమయానికి బయటి నుండి లోపలికి వస్తున్న పదేళ్ల కిషోర్ తండ్రి చుట్టూ ఐదుమంది చేతులలో కత్తులు పెట్టుకుని మాట్లాడ్డం చూసి ఆగిపోయాడు. బయటినుండి అంతా చూడసాగాడు.

"వజ్రదత్తా! వీళ్లు నలుగురు నా ప్రాణ మిత్రులు. వీళ్లను నీకు పరిచయం చేస్తాను; నిన్ను చంపింది ఎవరెవరని తెలుసుకుని తృప్తిగా ప్రాణాలు వదులు!" అన్నాడు హిమకేతువు.



"హిమకేతూ! మర్యాదగా ఇక్కడి నుండి బయటికి వెళ్లిపో" అనరిచాడు.

"వెళతాను. ముందు నా పని పూర్తి అవనీ; ఆ తరువాత వెళతాను. ముందు నా స్నేహితులని నీకు పరిచయం చేస్తున్నా!"

"ఇతను నా ప్రాణ మిత్రుడు - వీరకేసరి, ఈ వస్తాదు పేరు మల్లరాయుడు ఇతను కీర్తివర్మ, ఇతని పేరు నాగరాజు. మేం వచ్చినది - నీ కుటుంబాన్ని నాశనం చేయడానికి, మిమ్మల్ని చంపి, మేం ఈ నగరం వదలి, ఇక్కడికి దగ్గరలో వున్న 'అమరావతి'కి వెళ్లి పోతున్నాం. ఆ తరువాత మమ్మల్ని ఎవరూ తెలుసుకోలేరు" అన్నాడు హిమకేతువు.

అంతటినీ వింటున్న కిషోర్ రక్తం పొంగిపోయింది. వెంటనే వారి మీద సింహంలా పడాలనుకున్నాడు. కానీ తాను చిన్న పిల్లవాడు. వారు సులభంగా చంపేస్తారు. ఆ తరువాత వారు తప్పించుకు వెళ్లిపోతారు. వారిని పట్టుకోడం ఎవరి తరమూకాదు. తాను వారికి తెలియకుండా ఇక్కడే దాగివుండి, పెరిగి పెద్దయిన తరువాత, వారిని చంపాలనుకుని ఆగాడు. అక్కడున్న ఐదు మందిని బాగా పరీక్షగా చూశాడు.

హిమకేతువు - సన్నటి మీసాలు మెలివేసి వున్నాడు. అతని మెడలో బంగారు హారానికి పెద్ద నక్షత్రం వ్రేలాడుతూంది. బుగ్గమీద పెద్ద గాయం మచ్చ గుండ్రంగా వుంది.



వీరకేసరి కుడిచేతికి ఆరువేళ్లున్నాయి, మీసాలు లేవు, చాలా బక్క పలచనివాడు, చెవులు గాడిద చెవులులా పెద్దగా వున్నాయి.

వస్తాదు మల్లరాయుడు మంచి బలశాలి. అతని బలం చూపాలని చిన్న పంచె మాత్రం కట్టుకున్నాడు. పైన బట్ట వేసుకోలేదు. అతని గుండెలమీద ఎగురుతున్న సింహం గుర్తుతో పచ్చ పొడిపించుకొని యున్నాడు. కండలు తిగిరిన మంచి పుష్టిగల శరీరం.

కీర్తివర్మ కుడిచేతికి సన్నని బంగారు గొలుసు వుంది. ఆ గొలుసులో చిన్న గుఱ్ఱపు బొమ్మ వేలాడుతూంది.

నాగరాజు కళ్లు చూడడానికి పాము కళ్లలా వున్నాయి. అతని ఆకారం నీలిరంగులో వుంది. అతడు వేసుకున్న దుస్తులలో పాము బొమ్మలున్నాయి. ముఖానికి పాము బొమ్మ బొట్టు పెట్టుకున్నాడు. పాము ఆకారంలో వున్న వుంగరంచేత ధరించి వున్నాడు. అంతే కాదు; అతని చేతిలో నిజమైన పాము చుట్టుకొని వుంది.

బయటవున్న కిషోర్ అందరినీ బాగా గుర్తు పెట్టుకున్నాడు.

అంతలో ఇంటిలోపలి నుండి లక్ష్మి బయటికి వచ్చి, తన భర్త చుట్టూ వున్న వారిని చూసి, "ఎవరు మీరు? ఎందుకొచ్చారు?" అనడిగింది.





ఆమె మాటలు వినిపించుకోకుండా, "మిత్రులారా! మనం వచ్చిన పని పూర్తి చేద్దామా?" అంటూ హిమకేతువు కత్తితో ముందుకు అడుగువేశాడు.

ఐదు మంది కత్తులు ఒక్క క్షణంలో ఆ ఇద్దరి దంపతుల గుండెల్లోకి దిగాయి. వారి శరీరం నుండి వెచ్చటి రక్తం ఎగిరి అందరి ముఖాల మీద పడింది.

ఐదు మంది పెద్దగా నవ్వుతూ, "ఈ ద్రోహికి తగిన శాస్తి జరిగింది. వీడి కుటుంబాన్ని నాశనం చేశాం. ఇక ఈ ఇంటికి నిప్పు అంటించి మనం వెళ్లిపోదాం!" అన్నాడు హిమకేతువు.

అంతా చూస్తున్న కిషోర్ తల్లిదండ్రులు తన కళ్లముందర గిలగిలా కొట్టుకొని చని పోవడం చూసి తల్లడిల్లిపోయాడు. తన కోపాన్ని అప్పటికి అణచుకున్నాడు. ఆ నరాంతకుల ప్రాణాల్ని ఎన్నటికైనా బలిగొనాలనుకున్నాడు.

ఇంటికి నిప్పంటించడానికి నిప్పుకోసం వెదకుతున్న హిమకేతువు బయట నిలబడివున్న కిషోర్‌ను చూశాడు.

"మిత్రులారా! ఆ పిల్లవాడు ఈ వజ్ర దత్తుని కొడుకు కాబోలు! మనం వాడి తల్లి దండ్రులను చంపింది చూసి వున్నాడు. మనం చేసిన హత్యలకు సాక్షి వీడొక్కడే మిగిలాడు. కనుక వీడ్ని పట్టుకోండి; ముక్కల కింద నరకండి, పరిగెత్తండి, వదలకండి!" అంటూ అరవసాగాడు హిమకేతువు.

ఆ మాటలు వినగానే కిషోర్ భయంతో అడవిలోకి పరిగెత్తసాగాడు. అతడ్ని ఐదు మందీ వెంటాడసాగారు.

కిషోర్ అతివేగంగా పరిగెత్తుకెళ్లి ఒక పొదలో దూరాడు. అతని వెనుక వస్తున్న వాళ్లు పొదవద్ద ఆగి ముందు పరిగెత్తుతున్న కిషోర్ కనబడకుండా పోవడంతో ఆశ్చర్య పోయారు. అక్కడే దాగి వుంటాడని ఆ చుట్టుప్రక్కల వెదకసాగారు. కిషోర్ అలాగే పొదలో వుండిపోయాడు.

ఉన్నట్టుండి కిషోర్ కాలిమీదుగా పాము వచ్చి నిలిచింది. దాన్ని చూడడంతో పిల్లవానికి ముచ్చెమటలు పోశాయి. అరుద్దామంటే, ఆ ప్రక్కన వెతకుతున్న నరాంతకులకు బలి అయి పోతాడు, పోనీ, మెల్లగా కదులుదామంటే పాము కాటు వేస్తుందేమో అన్న భయం. పాపం! ఆ పదేళ్ల పసివాడు కష్టపడి ధైర్యం చిక్కబట్టి పామును చూస్తూ వుండిపోయాడు. అదేం విచిత్రమోగాని, అతని కాలిమీద కెక్కిన పాము అటూ ఇటూ కదలక అలాగే నిలిచి వుంది. ఆ నరాంతకులు మెల్లగా పొదలో అడుగుపెట్టి లోపలికి రాసాగారు. ఇక క్షణంలో లోపలున్న కిషోర్ వారి కంటికి తప్పక కనపడగలడు!



ఆ క్షణంలో కిషోర్‌కి మంచి ఆలోచన తట్టింది. అంతే! మరుక్షణం కాలు కదల్చకుండా, అలాగే భూమి మీద వెల్లికిలా పడుకుని, కళ్లు తేలవేసి, నోటి నుండి నురుగు కార్చసాగాడు. సరిగ్గా ఆ సమయానికి నరాంతకులు కిషోర్ పరిస్థితిని, కాలు వద్ద వున్న పామును చూసి, "అరెరే! పిల్లవాడు మనకి భయపడి ఈ పొదలో దాగి పాము కాటువల్ల చనిపోయాడు; అతనికి మన చేతిలో చావు లేకపోయింది. ఇంతకీ మన పని ముగిసింది, ఇక ఇక్కడ వుంటే మనకి ముప్పు. వెంటనే మనం 'అమరావతి' నగరానికి వెళ్లి, అక్కడ మన పేర్లు మార్చుకుని, హాయిగా కాలం గడుపుదాం, పదండి!" అన్నాడు హిమకేతు.

వెంటనే అందరూ ఆ పొదనుండి బయటికి వచ్చి అమరావతి నగరానికి బయలుదేరారు.

అంతవరకు కిషోర్ కాలిమీద వున్న పాము మెల్లగా పక్కకి జరిగింది. అంతవరకు ప్రాణం బిగబట్టుకుని వున్న కిషోర్ మెల్లగా లేచి, పొద నుండి బయటికి తొంగి చూశాడు.

దూరం నుండి ఐదుమంది నరఘాతకులు పోతూ వుండటం కనిపించింది.

"అమ్మయ్యా, బ్రతికాను! ఇక ఇక్కడే వుండి అన్ని విద్యలు నేర్చుకుని పెరిగి పెద్దవాడ్నయ్యాక, ఈ నరాంతకులు దాగివున్న 'అమరావతి'కి వెళ్లి, అందరినీ మట్టుబెట్టి నా పగ తీర్చుకుంటాను!" అని మనసులో అనుకుని ముందుకు అడుగువేసాడు.

(ఇంకావుంది)





# సంతకాల జోస్యం

మన జీవితం ఎలా వుండబోతున్నదనే ఆసక్తి దాదాపుగా అందరికి వుంటుంది. అందుకు వివిధ మార్గాల ద్వారా ప్రయత్నిస్తుంటారు మనుషులు. జ్యోతిషం, సోది, చిలక జోస్యం ఇలా ఎన్నో ప్రయత్నాలు. అంతేకాక మన ఇష్టా ఇష్టాలను బట్టి మన జన్మ తేదిలు, నక్షత్రాలు పరిశీలించి భవిష్యత్తు చెపుతుంటారు. ఈ మధ్య మానవుడు సంతకం చేసే పద్ధతిని పరిశీలించి అతని గుణగణాలు చెప్పగలుగుతున్నారు. కొన్ని వివరాలు:

1. ఎడమ నుండి కుడికి గాని, కింద నుండి పైకి గాని, పై నుండి కిందకు గాని సంతకం చేసే వ్యక్తి పైకి ఎంతో గంభీరంగా, రిజర్వుడుగా కన్పించినా సహృదయుడై వుంటాడు. నమ్మదగిన వ్యక్తి.
2. కొంతమంది సంతకంలో చాలా పెద్ద అక్షరాలు రాస్తూ వుంటారు. అటువంటి వారు పైకి మంచిగానే కనిపించినా వారికి ఈగో (అసూయ) ఎక్కువగా వుంటుంది.
3. అలా పెద్ద అక్షరాలలో కాక చిన్న అక్షరాలతో సంతకం చేసేవారు కొందరుంటారు. వారు తమని తాము ప్రాధాన్యత లేని సాధారణ వ్యక్తులుగా భావించి ఆత్మన్యూనతల్‌తో బాదపడతారు.
4. మరికొంతమంది సంతకం చాలా గజిబిజిగా, పిచ్చుక గూడు ఏమీ అర్థం కానట్టు వుంటుంది. అటువంటి వ్యక్తులు తమ గురించి ప్రపంచానికి ఏమి తెలియకూడదని భావిస్తారు.
5. కొందరు సంతకం అంతా చేసేసాక చివరి అక్షరం నుండి స్ట్రోకును మళ్ళీ మొదటకు తీసుకు వచ్చి విడుస్తారు. అటువంటి వ్యక్తులు తమని తాము పొడు చేసుకుంటారు. అందిన అవకాశాలు జారవిడుస్తారు.
6. కొంతమంది సంతకం చేసేసి దాన్ని అండర్‌లైన్ చేస్తారు. అలా రెండు సార్లు అండర్‌లైన్ చేసే వ్యక్తులు పరిస్థితులకు రాజీపడిపోయి బ్రతుకుతారు. ఒకసారి చేసే వారు నిర్మోహమాటంగా వుంటారు. ఆత్మవిశ్వాసం ఎక్కువ.

శ్రీమతి టి.లక్ష్మి, హైదరాబాద్



# మానవత్వం విలువ

పూర్వం అవంతీ నగరాన్ని ధూమకేతు అనే రాజు పరిపాలించేవాడు. అతడు మానవత్వం లేని పరమ క్రూరుడు. ఆ రాజుకి పూలంటే చాలా ఇష్టం. పూల తోటలో రకరకాల పూలమొక్కలు, పూలతీగలు వేయించాడు. అంతఃపురంలో తన మందిరంలో పది పూల కుండీలను ఒక వరుసలో పెట్టించాడు. ఈ పూల కుండీలలోను, తోటలోను పూల మొక్కలకు ప్రతిరోజు గోపయ్య నీళ్లు పోస్తూవుండేవాడు.

ఒకరోజు రాజమందిరంలో పూల కుండీలకు నీళ్లు పోస్తూ వుండగా గోపయ్య చెయ్యి తగిలి ఒక కుండీ కిందపడి పగిలి పోయింది. రాజు ఉగ్రుడై అతనిని ఖైదులో పెట్టించాడు. అతనిని ఉరి తీయమని కూడా ఆజ్ఞాపించాడు.

గోపయ్య స్థానంలో శివయ్య అనే ఒక తెలివైన వాడు పనిలో చేరాడు. అతడు పనిలో చేరిన మొదటి రోజునే రాజమందిరంలో మిగిలి వున్న తొమ్మిది కుండీలను రాజు చూస్తూ వుండగానే వాటిని కావాలని కింద పడగొట్టాడు. అవి పగిలిపోయాయి. రాజు కోపం పట్టలేక శివయ్యతో, "నువ్వు నిర్లక్ష్యంతో చేసిన ఈ తప్పుకు శిక్ష ఏమిటో తెలుసా?" అన్నాడు. "ఒక కుండీ పగల కొట్టిన గోపయ్యకు ఉరిశిక్ష



విధించినట్లే నాకూ ఉరిశిక్ష విధిస్తారు. ఒక చిన్న పూలకుండీ చేయి జారి క్రిందపడి పగిలి పోపటంతో ఆ చిన్న పొరపాటుకే ఉరిశిక్ష విధిస్తే ఇక పెద్ద, పెద్ద నేరాలు చేసే వారిని ఎలా శిక్షిస్తారు మహారాజా! ఒక చిన్న పొరపాటు కూడా చేయని మానవుడుంటాడా! దీనికే మీరు ఇంత పెద్ద శిక్ష విధించాలా! నేను కూడా గోపయ్యలాగా ఒక్క కుండీ పగల కొడితే నా స్థానంలో తరువాత వచ్చే పనివాడి వలన పొరపాటు జరిగితే అతనికి అదే గతి పడుతుంది. ఈ విధంగా నా తరువాత వచ్చే ఎనిమిది మంది పనివాళ్లు ఎనిమిది కుండీలను పొరపాటున పగలకొట్టడం జరిగితే, ఆ ఎనిమిది మంది ఉరిశిక్షకు బలి అవుతారు. ఆ విధంగా వాళ్లు బలికాకూడదని నేను తొమ్మిది కుండీలను కావాలనే పగల కొట్టాను. నాకు ఉరిశిక్ష వెయ్యండి. తప్పు చేయడం మానవుని సహజ లక్షణం" అన్నాడు శివయ్య రాజుతో. శివయ్య మాటలతో రాజుకు కను విప్పు అయింది. మానవత్వం విలువ తెలిసింది. వెంటనే రాజు గోపయ్య ఉరిశిక్షను రద్దు చేశాడు. తెలివైన శివయ్యను తనకు సలహాదారునిగా నియమించాడు. రాజు ఆనాటి నుంచి క్రూరత్వాన్ని వదిలి, దయాగుణాన్ని అలవరచుకున్నాడు.

కూచిబట్ల శ్రీనివాసశాస్త్రి





# పొరపాటు

రాజు, రవి ఇంటర్ చదువుతున్న స్నేహితులు. ఇద్దరూ బాగానే చదువుతారు. రాజుకి కొంచెం ఆవేశం, తొందరపాటు ఎక్కువ. "వి.పి.ఎల్ ట్వంటీ ట్వంటీ" క్రికెట్ పోటీల జోరులో ఇద్దరూ మ్యాథ్స్, ఇంగ్లీషు పరీక్షలు చక్కగా అనుకున్న రీతిలో రాయలేక పోయారు.

అయినా సంవత్సరం పొడగునా చదివి రాసాం కదా పాసవుతామన్న ధీమాలో ఫలితాలకై ఎదురుచూడసాగారు.

ఫలితాలు ప్రకటించారు.

రవి, రాజుకు ఫోన్ చేసాడు. "రాజూ! నేను పాసయ్యానురా! నీ నెంబరే పేపర్లో లేదు. ఒకవేళ మ్యాథ్స్‌లోనో, ఇంగ్లీషులోనో ఫెయిలైయ్యావేమో!" సందిగ్ధంగా చెప్పాడు రవి.

రాజు గుండెల్లో రాయి పడింది. సాయంత్రం పేపర్లో ఫలితాలు ప్రకటించడంతో రవి వాళ్ళింటి దగ్గర్లోని బుక్‌స్టాల్‌లో న్యూస్ పేపర్ కొని చదివి వివరాలందించడన్నమాట.

రాజు వాళ్ళ నాన్న ఆఫీస్ నుండి రావడానికి ఏడవుతుంది. వాళ్ళమ్మ వంటింట్లో రాజుకి పాలు కలుపుతోంది. సాయంత్రం అయిదు గంటలప్పుడు. రాజుకి తండ్రిని తలచుకుంటుంటేనే భయంగా ఉంది. క్రికెట్ మోజులో పడి చదువును నిర్లక్ష్యం చేయొద్దని ఎంతగానో తండ్రి నచ్చచెప్పాడు. ఏదీ! తను వింటేనా!

ఒంటరిగా గదిలో కూర్చుని ఏడ్చాడు. స్నేహితులు, బంధుమిత్రులు, నాన్నమ్మ, తాత వీళ్ళందరిలో ఎంత అవమానం. సెప్టెంబర్‌లో మరోసారి రాసి పాసవ్వొచ్చు.

కానీ వీళ్ళందరి తిట్లూ, సలహాలు అంత వరకు ఎవరు భరిస్తారు.

ఏడుస్తూ ఉరి వేసుకుని చనిపోవాలని కున్నాడు రాజు.

గది తలుపు తాళం వేయబోతుండుగా అన్నయ్య వినయ్ వచ్చాడు.

'రేయ్! రాజూ! నీవు పాసయ్యావురా! ఇంటర్‌నెట్‌లో ఇప్పుడే నీ మార్కులు చూశాను. న్యూస్ పేఫర్‌లో నీ నెంబర్ మిస్ అయ్యింది. మరో రెండు వేరే పత్రికలలో నీ నెంబర్ ఉంది. అందుకే నీవేమైనా బాధపడతావని కాలేజ్ నుండి నేరుగా వచ్చేసాను ఇంటికి" గబగబా చెప్పాడు వినయ్.

రాజు అన్నయ్యని కౌగిలించుకుని బావురమన్నాడు.

చాలాసేపు వెక్కి వెక్కి ఏడ్చాడు. ఇంతలో వాళ్ళమ్మ శాంత వచ్చింది. రాజుకి పాలు కలిపి ఇచ్చింది.

వినయ్ చెప్పిన వివరాలు విని భర్త సెల్‌కి ఫోన్ చేసి రాజు పాసయ్యాడని చెప్పింది. రాజు, వినయ్, వాళ్ళమ్మ శాంత రాజు వాళ్ళ నాన్న రాగానే అందరూ కలిసి సంతోషంగా హోటల్‌లో భోంజేసి వస్తూ వస్తూ వీధిలో వాళ్ళకి, ఫ్రెండ్స్‌కి స్వీట్లు, చాక్లెట్లు కొని తెచ్చారు.

ఆ రోజు వారందరికీ ఆనందంగా గడిచిపోయింది. రాజుకి మ్యాథ్స్‌లో ఎనభై పర్సెంట్ మార్కులొస్తే ఇంగ్లీషులో డెబ్బై రెండు. నిజానికి అంతకంటే ఎక్కువొచ్చేవే. క్రికెట్ మోజులో పడి ఆఖరి రెండు నెలలు చదువును నిర్లక్ష్యం చేసాడు.

దానికి మూల్యం కొంచెం లేటుగా ఇంజనీరింగ్ కాలేజీల్లో కౌన్సిలింగ్‌కి పిలుస్తారు. ఆ మాటే మెల్లగా రాజు వాళ్ళ నాన్న అతనికి చెప్పి మెత్తగా చీవాట్లు పెట్టాడు.

మర్నాడు పరీక్షా ఫలితాలు, స్టేట్ ఫస్ట్ వచ్చిన వారి ఫోటోలు, ఇంటర్వ్యూలతో న్యూస్ పేపర్ నిండిపోయింది.



శశిరేఖా లక్ష్మణన్, చెన్నై



# అదెంత పని

శేఖరం, సుందరం వరసకు అన్నదమ్ము లవుతారు, రెండు వాటాలలో వారిద్దరూ వుంటున్నారు.

ఓ రోజు ఉన్నట్లుండి సుందరంగారి వాటాలో వున్న ట్యూబులైటు వెలగడం మానేసింది. రెండు రోజులు గడచినా, సుందరం ఆ విషయం పట్టించుకోలేదు.

"గుడ్డి వెలుగులో అసలు కళ్ళు కనపడడం లేదు బాబూ! ఎవరినైనా ఎలక్ట్రీషియన్‌ను పిలుచుకు రాకూడదూ?" అంటూ విసుక్కో సాగింది సుందరం భార్య.

"అన్నయ్యకు మరీ బద్ధకం వదినా! ఆ స్క్రూడ్రైవరు తీసికొని ఆ ట్యూబులైటు ఊడదీస్తే ఎక్కడ చెడిపోయిందో తెలుస్తుంది గదా! ఈ మాత్రం దానికి ఎలక్ట్రీషియన్ కావాలా?" అప్పటి దాకా వదినగారి గొణుగుడు విన్న శేఖరం అన్నాడు. "మనకు అలవాటు లేని పని గదా అది, తెలీని వాటి జోలికి వెళ్ళడం ఎందుకురా అనవసరంగా!" ఆవలిస్తూ కోపంగా అన్నాడు సుందరం.

"నీకేం తెలియదులే అన్నయ్య! అయినా, అదెంత పని, నే జేసి చూపించమంటావా?" లుంగీ పైకి కట్టుకొని బయల్దేరాడు శేఖరం. "నువ్వెప్పుడూ ఎలక్ట్రిక్ పని నేర్చుకోలేదు గదా! నీకేం తెలుస్తుంది బాబాయ్?" ట్యూబులైటు సెట్టు మొత్తం విప్పి వైర్లు అటూ-ఇటూ కదుపుతున్న శేఖరాన్ని అడిగాడు సుందరం పెద్ద కొడుకు.

"బుర్ర ఉండాలిగాని, ఇట్లాంటివో పెద్ద లెక్కట్రా? ఏ వైరు ఎలా ఉండాలో తెలియాలంటే, మా ట్యూబులైటు ఊడదీసి చూస్తే తెలియదా?" అని వెలుగుతున్న తమ ట్యూబులైటు ఆర్పి ఊడదీసాడు శేఖరం.

రెండు సెట్లూ ఒకదాని ప్రక్కన మరోటి పెట్టి ఒక దాన్ని జూస్తూ మరోటి సరి జేయ సాగాడు ఆలోచించుకుంటూ.

స్టార్టర్‌తో కాసేపు కుస్తీ పట్టి, దాని లోపల ఘల్లు ఘల్లు మని మ్రోగుతుండడంతో గట్టిగా అటూ - ఇటూ త్రిప్పడంతో అది కాస్తా 'టప్'మని ఊడిపోయింది.

"స్టార్టర్ పాడయినట్లుంది" అని కొలంబస్ అమెరికాను కనుగొన్నంత గర్వంగా ప్రకటించాడు.

"మీరు చేసిన ఘన కార్యం చాలు గాని, కనీసం అవి వేటి స్థానాల్లో వాటిని ముందు బిగించండి!" ముద్దుగా విసుక్కుంటూ అంది శేఖరం భార్య - బాగా ప్రొద్దుపోవడంతో.

"మీ లాంటి వాళ్ళంతా ఎప్పుడూ ఇంతే! ఏదీ మొదలెట్ట బోయినా వెనక్కు లాగుతుంటారు. ట్యూబును కాస్త గట్టిగా అటూ - ఇటూ త్రిప్పితే, తానంతటదే వెలుగుతుంది. ఆ మాత్రం కూడా తెలీకుండా ఏదో అనేస్తుంటారు!" అని శేఖరం ట్యూబును గట్టిగా అటూ - ఇటూ త్రిప్పసాగాడు. పాపం! ఎంత త్రిప్పినా వెలగక పోయేసరికి విసుగొచ్చిందతనికి. చివరకు కోపంతో "రేపొద్దున చూడాలి దాని పని" అంటూ లోపలికి నడిచాడతను.

మర్నాడు సుందరం పంపిన కరెంటు పనివాడొచ్చి లైటు జూసి 'చౌకు పోయిందమ్మా!' అంటూ కుర్రాడిని పంపి, కొని తెప్పించి, బిగించడంతో అది వెలగసాగింది ఎప్పటిలా.

"పాపం! మా మరిది వాళ్ళది కూడా కాస్త చూడు నాయనా! నిన్న ఇది వెలగలేదని ఏదో తంటాలు పడ్డాడు!" అంది సుందరం భార్య.

"దీన్నెవరో గట్టిగా తిప్పారమ్మా! ట్యూబు, స్టార్టరు పోయాయ్. వేయించమంటారా?" అన్న మాటలు విన్పించాయ్ లోపలున్న శేఖరానికి 'అదెంత పని' అని తెలియని వాటిల్లో తల దూర్చడం ఎంత బుద్ధి తక్కువో అప్పుడర్థమయింది శేఖరాన్ని నలభై రూపాయలు అనవసరంగా ఖర్చు కావడంతో.

యమ్.వి. అనసూయ, తుని



# మనిషే వింతల సమూహం

- ఎవరి శరీరంమీద ఎక్కువ సంఖ్యలో పుట్టుమచ్చలు వుంటాయో అలాంటి వ్యక్తులు ఎక్కువ కాలం జీవిస్తారట!
- మన వెంట్రుకలలో జింక్, కాపర్ ఎక్కువగా వుంటే తెలివితేటలు ఎక్కువగా వుంటాయట!
- మన కీళ్ళలో వుండే కార్టిలేజ్‌లేయర్స్ ఒత్తిడికి గురవడం వల్ల సాయంత్రంపూట మన ఎత్తు ఒక సెంటిమీటరు తగ్గుతుంది. ఉదయం మాత్రము ఎత్తు మామూలుగానే వుంటుంది.
- మూత్రాశయంలో వుండే కిడ్నీ స్టోన్స్ పసుపు పచ్చరంగులో, గోధుమ రంగులో వుంటాయి. నల్లగా, తెల్లగా వుండవు.
- మన శరీరంలో 1 సెకెన్ సమయంలో 15 మిలియన్ ఎర్రరక్త కణాలు ఉత్పత్తి అవుతాయి. అంతే సంఖ్యలో అంతకుముందున్న ఎర్రరక్త కణాలు నాశనమవుతాయి.
- ప్రపంచంలో ప్రతి ఏడు సెకెన్‌లకు ఒక శిశువు జన్మిస్తుంది.
- ఆరోగ్యం బాగావున్న మనిషి ప్రతిరోజు కనీసం ఆరుసార్లు టాయ్‌లెట్‌కు వెళ్తాడు.
- మగవారి మెదడు 1408 గ్రాముల బరువుంటే ఆడవారి మెదడు 1263 గ్రాముల బరువే వుంటుంది.
- మనిషి మెదడులో అతి సూక్ష్మమైన న్యూటన్లు అనేక భాగాలు పదివేల కోట్ల వరకు వుంటాయి. అవన్నీ లెక్కించాలంటే 3000 సంవత్సరాలు పడుతుందట!
- 70 కిలోల బరువున్న మనిషి యొక్క అస్థిపంజరం 13 కిలోల బరువు తూగుతుంది.
- రక్త కణాలు ఎంత చిన్నగా వుంటాయో తెలుసా! ఒక సెంటిమీరులో 1000వ వంతు వ్యాసంతో వుంటాయి. ఇంగ్లీష్ 'A' అని వ్రాసినంత స్థలంలో 50 లక్షల రక్తకణాలు పడతాయట.
- ఒక సారి తిన్న ఆహారం పూర్తిగా జీర్ణమవాలంటే రెండు రోజుల సమయం పడుతుంది.
- ఒక రక్తపు బొట్టులో 450 తెల్లరక్త కణాలు, 250 మిలియన్ ఎర్రరక్త కణాలు వుంటాయి.

జి. ప్రభాకర్ రావు, హైదరాబాద్



# దేవీ లీలలు



## శ్రీ నిత్యాదేవీ ధ్యానము

నిత్యం భజే
బాలశశాంక చూడాం
పాశాంకుశా కల్ప
లతాం కపాలమ్ ।
హస్తైర్వహంతీ
మరుణాం త్రినేత్రా
మాస్ఫాలయంతీం
కరవల్లకీమ్ తామ్ ॥

ఆరు చేతులతో, మూడు కన్నులతో, శిరముపై చంద్రరేఖతో, ఎర్రని శరీరచ్ఛాయతో మెరిసే నిత్యాదేవికి వందనం. అంకుశం, కల్పలత, కపాలము, పాశము ధరించి, రెండు చేతులతో వీణను మ్రోగిస్తూ, ఆరు చేతులతో ఆలరారు తల్లీ, మమ్ములను రక్షించు!

## 13

## సహస్రకంఠుని కథ

శ్రీరాముడు దశకంఠ రావణుని సంహరించి లంక నుండి సీతను తీసుకొని వచ్చాడు. కాని, సీత శీలాన్ని శంకించి అగ్ని పరీక్ష చేసాడు.

అగ్ని సీతను పరమ పతివ్రత అని అప్పగించిన తర్వాత, శ్రీరాముడు సీతను భార్యగా ఆదరించాడు.

మునులు శ్రీరామచంద్రుణ్ణి, ఆయన శక్తిని గురించి గొప్పగా పొగిడారు.

సీత ఆ మాటలకు పగలబడి నవ్వింది. మునులు ఆశ్చర్యంతో, "తల్లీ! నీ భర్తను గురించి పొగడుతుంటే, అలా పరిహాసంగా ఎందుకు నవ్వావమ్మా?" అంటూ సీతకు చేతులు జోడించి, ప్రశ్నించారు మునులు.



శ్రీరాముడు సీత వైపు అనుమానంగా చూసాడు.

సీత మళ్ళీ నవ్వి, "మీరు దశకంఠ రావణుని గెల్వటం గొప్ప కాదు; రావణాసురుడి అన్న సహస్ర కంఠుని గెలవటం గొప్ప!" అంది.

ఆమె మాటలకు మునులందరు ఆశ్చర్య పోయారు.

సీత చిన్నగా నవ్వి, "రావణాసురుడి కంటే నూరు రెట్లు మహా శక్తివంతుడు, వేయి తలలతో శత్రువులను గడగడలాడించే భీకర రూపంతో, చిత్ర విచిత్ర మాయ విద్యలతో అలరారు సహస్ర కంఠుడు, రావణాసురుడి అన్న!" అని ఓరగా శ్రీరాముని చూసింది.

శ్రీరాముడు లక్ష్మణుని చూసాడు.

లక్ష్మణుడు లేచి, "నాకు ఆజ్ఞ ఇవ్వండి; ఆ సహస్ర కంఠుని సంహరించి ఆ వేయి తలలు తీసుకుని వస్తాను!" అన్నాడు.

హనుమంతుడు రొమ్ములు బాదుకుంటూ గర్జించి, "శత్రు శేషం వుండటం ఎప్పటికైనా అపాయం గదా! నాకు ఆజ్ఞ ఇవ్వండి; వాడిని సంహరించి వస్తాను!" అన్నాడు.

ఇలా సుగ్రీవుడు, జాంబవంతుడు, అంగదుడు మొదలైన వారు సహస్ర కంఠుని చంపి తీసుకొస్తామని పైకి లేచారు.

సీత మళ్ళీ పగలబడి నవ్వింది.

శ్రీరాముడు సీతను కోపంతో చూసి, "సీతా! ఏమిటి నీ పరిహాసం? అబలవు బలశాలురను చూచి పరిహసించరాదు!" అన్నాడు.

సీత అందుకు తలవంచుకొని, "మీరు జయించలేని సహస్ర కంఠుని ఇక మీ అను చరులు ఎలా చంపగలరు? అందుకే నవ్వాను!" అంది.

అంతే! శ్రీరాముడు దిగ్గున లేచి, "ఆ సహస్ర కంఠుడిని చంపి తీరాలి. సీత నాతో పాటు యుద్ధ రంగానికి వస్తుంది; మీరందరూ రావాలి. నేను ఆ సహస్ర కంఠుని చంపటం చూడగలరు!" అన్నాడు.

మరుసటి రోజు తన వానర సైన్యంతో సేనతో శ్రీరాముడు సీతతో పాటు యుద్ధానికి బయలుదేరాడు.

సహస్ర కంఠుడు వున్న కోటను చేరారు.

సహస్ర కంఠుని చూడగానే, అందరికీ గుండెలు దడదడ లాడాయి.

వేయి తలలతో అతి భీకరమైన వజ్ర శరీరంతో, భయానకంగా వున్న సహస్ర కంఠుడు దిక్కులు దద్దరిల్లేలా వికటాట్టహాసం చేసాడు.



ణించారు. మరి కొందరు రక్తం కక్కుకుంటూ నేల కూలారు.

శ్రీరాముడు సీత వైపు చూసి, ఠీవిగా సహస్ర కంఠుడిపై యుద్ధానికి తలపడ్డాడు.

పోరు భీకరంగా సాగింది.

సహస్ర కంఠుడి బాణాల ధాటికి రాముడు మూర్ఛపోయాడు.

అంతే! సీతాదేవి రౌద్రాకారంతో పైకి లేచింది - జుత్తు విరబోసుకుని, నడుముపై రెండు చేతులూని పెద్ద కళ్ళని గిరగిరా తిప్పి వికటాట్టహాసం చేసింది.

ఆమె వికటాట్టహాసానికి సహస్ర కంఠుడి కోట బీటలు వారింది! ఆకాశం దద్దరిల్లింది! సముద్రాలు ఘోషించాయి!

సీతాదేవి రౌద్రాకారం నుండి అనేక శక్తులు, మాతృకలు, అద్భుత రూపులు వెలువడ్డారు.

ఖండించి ఆ తలలతో బంతులాట ఆడుకో సాగారు.

సీతాదేవి భారాన్ని భూమి మోయలేక పోయేసరికి, శివుడు ఆమె పాదముల క్రింద పడ్డాడు.

సీత భూ నభోంతరాళాలు దద్దరిల్లేలా కేక వేసి, సహస్ర కంఠుని చంపింది!

శ్రీరాముడు మూర్ఛ నుండి తేరుకుని, ఆ దృశ్యం చూసి చకితుడైనాడు.

సీత విశ్వరూపం వల్ల శ్రీరామునకు జ్ఞానోదయం అయింది. ఆమె అబల కాదు, ఆదిశక్తి అని గ్రహించాడు.

ఆమెను స్తుతించి పాడాడు హను మంతుడు.

అందరూ సాష్టాంగ నమస్కారం చేసారు.



"సీతాదేవి ఆదిశక్తి! అమ్మలకు అమ్మ! జగన్మాత! మహాశక్తి!" అంటూ హనుమంతుడు ఆమెను శ్లాఘిస్తూ శాంతింపచేసాడు.

సీతాదేవి రౌద్రాకారం ఉపసంహరించుకొని శాంతించింది! "మీకు కనువిప్పు కలిగేందుకే నేను ఇలా చేసాను- రావణుని నా భర్త చంపి, నన్ను తీసుకుని పోతే గొప్ప; అందుకనే అశోక వనంలో అన్నేళ్ళు గడిపాను. ఆ రావణుని క్షణంలో సంహరించి వుండేదాన్ని. కాని, శ్రీరాముడు రావణుని చంపి భార్యను తీసుకు వచ్చాడని, ఆయన కర్తవ్యం ముందు తరాల వారికి మార్గ దర్శకం కావాలని వూరు కున్నాను!" అంది.

హనుమంతుడు అనుమానంతో శ్రీరాముని వద్దకు వచ్చాడు.

శ్రీరామచంద్రుడు అతని ముఖ భావాన్ని చూసి నవ్వుతూ, "హనుమా! ఇది అంతా నాకు తెలుసు, అయినా, లోకానికి తెలియాలి కదా! అందుకే సీతాదేవి ఆదిశక్తి స్వరూపాన్ని ధరించి, సహస్ర కంఠుని సంహరించేలా చేసాను! ఇప్పుడు నీ అనుమానం తీరిందా?" అన్నాడు.

హనుమంతుడు శ్రీరామచంద్రునికి నమస్కరించి, "ప్రభూ! ఇన్ని రోజులు నీ చెంత వుండి కూడా ఈ సంగతి గ్రహించలేక వుండిపోయాను కదా! నా తల్లి సీతాదేవి ఆదిశక్తిగా ప్రత్యక్షమైనందువల్ల ఈ రోజు నా జన్మ పావనమయింది. 'సీతారామా! కోదండరామా! నా వల్ల, తెలిసీ - తెలియక ఏదైనా తప్పు జరిగి వుంటే, నన్ను క్షమించగలరు!" అంటూ వారి పాదాలకు నమస్కరించాడు.

అందరూ ఆమెకు క్షమాపణలు చెప్పుకున్నారు. విజయోత్సాహంతో అయోధ్య నగరానికి బయలుదేరారు.

*(అయిపోయింది)*







# రాంబాబు నిజాయితీ

నెల్లూరు స్టేట్‌బ్యాంక్‌లో సీనియర్ క్యాషియర్‌గా పనిచేస్తున్న రాంబాబు తిరుమల శ్రీవారి బ్రహ్మోత్సవాలు తిలకించాలని ఆ రోజు సాయంత్రం తిరుమల చేరుకొన్నాడు.

బ్రహ్మోత్సవాలను పురస్కరించుకొని తిరువీధులన్నీ రంగు రంగుల విద్యుద్దీపాలంకరణతో దేదీప్యమానంగా ప్రకాశిస్తున్నాయి. ఆ రోజు గరుడోత్సవం కావడంతో దేశంలోని వివిధ ప్రాంతాల నుండి భక్తులు తిరుమల చేరుకొంటున్నారు.

మలయప్పస్వామి సర్వాలంకార శోభితుడై శ్రీదేవి భూదేవి సమేతుడై గరుడ వాహనంపై తిరువీధుల్లో ఊరేగుతుంటే నాలుగు మాడ వీధులు భక్తజనంతో కిక్కిరిసిపోయాయి.

గరుడోత్సవం ముగియగానే రాత్రి పది గంటలకు రాంబాబు భోంచేసి సుదర్శన సత్రం చేరుకొన్నారు. అప్పటికే కొందరు యాత్రికులు హాలులో పడుకొని ఆదమరచి నిద్రిస్తున్నారు. రాంబాబు ఆ రాత్రి ఎక్కడో ఒక చోట పడుకొని కాసేపు నిద్రించాలనుకొన్నాడు. ఎంక్వైరీ కౌంటరు సమీపంలో కాస్త ఖాళీ జాగా కనిపించడంతో తన బెడ్‌షీటు పరచుకొని పడుకొన్నాడు. తనకు కుడివైపున పొట్టిగా నల్లగా లావుగా వున్న శాల్తీ ఒకటి గుర్రుపెట్టి నిద్రిస్తుంటే అతన్ని చూచి రాంబాబు లోలోపలే

యేదోటి రంగప్పనాయుడు, రైల్వేకోడూరు



నవ్వుకొన్నాడు. మరి కొంతసేపటికి రాంబాబుకు కూడా గాఢంగా నిద్ర పట్టేసింది.

తెల్లవారుజామున ఐదు గంటలకు రాంబాబు నిద్రలేచి బెడ్‌షీటు విదిలించి మడత బెట్టబోతుంటే ఆ బెడ్‌షీట్లోంచి ఒక బరువైన పర్సు క్రిందపడింది. అది తనది కాకపోవడంతో రాత్రి తన ప్రక్కన పడుకొని గుర్రుపెట్టి నిద్రిస్తున్న పొట్టివానిదై వుంటుందని రాంబాబు ఊహించాడు. వెంటనే దానిని ఓపన్‌చేసి చూశాడు. అందులో పదివేలా నాలుగు వందలు క్యాషు దానితో పాటు విజయవాడకు రిజర్వేషన్ చేయించుకొన్న రైలు టికెట్టు కనిపించింది. ఆ పొట్టివాడు విజయవాడ వాస్తవ్యుడని రాంబాబు గ్రహించాడు. ఆ పర్సు ఎలాగైనా అతనికి అందజేయాలనుకొన్నాడు. ఆ పర్సు పోగొట్టుకొన్న వ్యక్తి రాత్రి అక్కడే పడుకొని నిద్రించడంతో తప్పకుండా అతడు అక్కడికే వస్తాడని అతనికోసం నిరీక్షిస్తూ రాంబాబు అక్కడే సిమెంటు బెంచీపై కూర్చున్నాడు.

అర్థగంట తరువాత ఆ పొట్టిమనిషి హడావిడిగా పరుగెత్తుకొంటూ అక్కడికి వచ్చి ఎంక్వైరీ కౌంటరు చుట్టూ వెదకసాగాడు. రాంబాబు లేచి మెల్లగా అతని వద్దకు వెళ్లి "హలో! మీరు దేనికోసమో వెదుకు తున్నట్టున్నారు. ఏమైనా పోగొట్టుకొన్నారా?" అంటూ ప్రశ్నించాడు.

"ఔను, నా పర్సు పోగొట్టుకొన్నాను. రాత్రి ఇక్కడే పడుకొని నిద్రించాను. నా ప్యాంటు జేబులోవున్న పర్సు జారి ఇక్కడే ఎక్కడో పడిపోయింది. స్వామివారికి తలనీలాలిచ్చి పది వేల రూపాయలు శ్రీవారి హుండీలో వేస్తానని మొక్కుకొన్నాను. ఆ పర్సులో పదివేలా నాలుగు వందలు క్యాషు దానితోపాటు మా వూరికి వెళ్ళడానికి రిజర్వేషన్ చేయించుకొన్న రైలు టికెట్టు కూడా వుంది. నా మొక్కుబడి



తీరకపోవడమే గాక నేనిప్పుడు ఇంటికి కూడా వెళ్ళలేని స్థితిలో వున్నాను ఇక నేను ఆ వెంకటేశ్వరుని దర్శించుకోవడమెలాగ! నేను మొక్కుకున్న మొక్కుబడి తీర్చడమెలాగో ఏమీ పాలుపోవడం లేదు. అంతా అయోమయంగా వుంది. నా పరిస్థితిని చూసి ఆ స్వామి వారే ఏదొక మాయచేసి నన్ను ఆదుకోవాలి! నారాయణా నా కష్టం నుంచి నన్ను గట్టెక్కించు స్వామి!" అంటూ ఆ పొట్టి మనిషి రాంబాబు వైపు దీనంగా చూశాడు.

రాంబాబు జేబులో వున్న పర్సు తీసి "ఇదేనా నీ పర్సు" అన్నాడు. ఆ పొట్టిమనిషి ఆ పర్సు తీసుకొని "ఔను. ఇది నా పర్సే. ఆ వేంకటేశ్వరుని అనుగ్రహం వల్ల పోగొట్టుకొన్న నా పర్సు నాకు దొరికింది. మీ వంటి నిజాయితీ పరుల్ని నేనెక్కడా చూడలేదు. మీరు చేసిన మేలు నా జన్మలో మరవలేను. నా మొక్కుబడి తీర్చుకోడానికి ఆ భగవంతుడే మీ రూపంలో వచ్చాడేమోననిపిస్తుంది. అంటూ ఆ పొట్టివాడు పట్టరాని ఆనందంతో రాంబాబుకు కృతజ్ఞతలు తెలియజేశాడు.

రాంబాబు బ్రహ్మోత్సవాలు ముగిసేవరకు తిరుమలలోనే వుండి టి.టి.డి. ఆస్థాన మండపంలో నిత్యమూ జరిగే ఆధ్యాత్మిక కార్యక్రమాలు తిలకిస్తూ ఆ పరిసర ప్రాంతాలలోని ఆకాశగంగ, పాపనాశనం, వైకుంఠతీర్థం, శిలాతోరణం, కపిల తీర్థం తదితర పుణ్యక్షేత్రాలను దర్శించుకొని చివరి రోజు తిరుచానూరు వెళ్ళి పద్మావతీ అమ్మవారిని సేవించుకొని ఇంటికి చేరుకొన్నాడు.





# భక్తుని బానిస భగవంతుడు

కాశీ నగరంలో కృష్ణదాసు అనే ఒక వడ్రింగి ఉండేవాడు. అతడు చెక్క వస్తువులను చేస్తూ, వాటిని అమ్ముకుంటూ జీవనం సాగించేవాడు. అతడు పరమ భక్తుడు. నిరంతరం కృష్ణ ధ్యానంలో కాలాన్ని గడుపుతూ ఉండేవాడు. అతడు తన పని తాను చేసుకుంటూ కూడా నిత్యం కృష్ణుణ్ని మనసులో భజిస్తూ ఉండేవాడు. ఇలా ఎన్నో ఏండ్లు గడచిపోయాయి. తనకు కృష్ణభగవానుని దర్శనం కలుగలేదే! అని అతడు చాలా విచారపడేవాడు.

చివరకు కృష్ణదాసు ఇలా ఆలోచించాడు. "నేను చాలా పాపాత్ముణ్ని, అందుచేతనే భగవానుని దర్శనం నాకు కలుగలేదు. కనుక ఈ జన్మ వ్యర్థం, యమునా నదిలోకి దూకి ఆత్మత్యాగం చేసుకోవడం మంచిది" అని నిర్ణయించుకున్నాడు. ఇలా ఆలోచించి ఒక రోజు యమునా నది దగ్గరకు బయలుదేరాడు.

యమునానది ఒడ్డున ఒక పెద్ద వృక్షం ఉంది. ఆ వృక్షం క్రింద ఒక కుష్ఠురోగి పడుకుని నిద్రపోతున్నాడు. భగవంతుడు, ఆ కుష్ఠురోగి కలలో కనిపించి. "కృష్ణ దాసు అనే వ్యక్తి, ఈ యమునానది వైపు వస్తున్నాడు, నీవు అతని పాదాలు పట్టుకొని, "నీ కుష్ఠురోగం పోవాలి అని కృష్ణదాసుని దీవించమని అడుగు, కృష్ణ దాసు నిన్ను అలా దీవిస్తే, నీ వ్యాధి నయమైపోతుంది" అని చెప్పాడు.

కుష్ఠురోగి, నిద్రలేచి, కృష్ణదాసు కోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు. కృష్ణదాసు యమునానదికి వెళుతూ చెట్టు వద్దకు వచ్చాడు. కుష్ఠురోగి, "అయ్యా, నన్ను ఒకసారి మీ పాదాలను పట్టుకోనివ్వండి, నీ రోగం పోవాలని, మీరు నన్ను ఒకసారి దీవించండి" అని ప్రాథేయపడ్డాడు. అరే, నేనైతే మహా పాపిని, అందుకే భగవానుడు నాకు దర్శనం ఇవ్వడం లేదు. నాలో ఏ మహిమ లేదు. నన్ను వెళ్ళనివ్వు" అని కృష్ణదాసు యమున దగ్గరకు వెళ్ళబోయాడు.

కాని ఆ కుష్ఠురోగి, కృష్ణదాసును విడువ లేదు. ఏమైనా సరే తనను దీవించాలని పట్టు బట్టాడు. చేసేదిలేక కృష్ణదాసు, ఆ రోగిని "నీ కుష్ఠురోగం నిన్ను వదిలిపోవుగాక" అని మనసులో భగవానుని ధ్యానించి దీవించాడు. ఆశ్చర్యం, ఆరోగి, భయంకరమైన కుష్ఠు రోగం మాయమైపోయింది. అతడు మామూలు మనిషిలా మారిపోయాడు. అతడు కృష్ణ దాసుని పాదాలను. కళ్ళకద్దుకొని, ఆనందంగా వెళ్ళిపోయాడు. కృష్ణదాసుకు ఈ సంఘటన చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది. తనకు అంత మహిమ ఎలా వచ్చింది అని, కృష్ణదాసు ఆ యమునానది ఒడ్డున కూర్చుని ఆలోచించ సాగాడు. అంతలో దివ్య తేజస్సుతో, భగవానుడు అతని ముందు ప్రత్యక్షమై, "దాసు నీవు నిష్కామ భక్తి కలిగిన మహాభక్తుడవు. నీవు నిత్యం నన్ను పూజిస్తావు కాని, ఎప్పుడు ఏ కోరికా కోరలేదు. ఈ రోజు నీవు స్వార్థ రహితంగా, పరోపకార బుద్ధితో అతని రోగాన్ని నయం చేయమని కోరావు. నీ నిశ్చలమైన భక్తి వలన, నీకు తెలియకుండానే నీకు గొప్ప మహిమ కలిగింది. నీ భక్తి, మహిమచేత అతని వ్యాధిని నయం చేసావు. నీ జన్మధన్యమైంది. నిజమైన భక్తులకు, నేనెప్పుడూ బానిసగానే ఉంటాను. అని కృష్ణదాసును దీవించి, భగవానుడు, మాయమైపోయాడు.

కృష్ణదాసు అమితానంద భరితుడై, ప్రాణత్యాగం చేయాలనే, తన నిర్ణయాన్ని విరమించుకుని తిరిగి ఇంటికి వెళ్ళిపోయి, నిరంతరం భగవానుని ధ్యానంలో శేష జీవితాన్ని గడిపాడు.

దొడ్డిపట్ల పూర్ణిమ, హైదరాబాదు



# గొప్ప పని



తన రాజ్యంలో ఎవరెవరు గొప్ప పనులు చేసారో తెలుసుకోగోరిన సౌఖ్యపుర రాజు శశాంకుడు ప్రత్యేక సభను ఏర్పాటు చేసాడు.

రాజుముందు తాము చేసిన గొప్ప పనులు చెప్పేందుకు చాలామంది సభకు హాజరయ్యారు.

ముందుగా రాజ్యంలో ప్రసిద్ధ వ్యాపారిగా పేరొందిన ధనసృష్టి, 'ప్రభూ! నా సొంత ధనాన్ని వెచ్చించి మన రాజ్యంలో తారకేశ్వర ఆలయాన్ని కట్టించాను. దానికయిన మొత్తం అక్షరాలా లక్ష వరహాలు' అంటూ తన గొప్ప పనిని చెప్పాడు.

వెంటనే శశాంకుడు, 'అదేమీ గొప్ప పని కాదే!? వ్యాపారంలో వచ్చిన అధిక లాభాలతో కట్టిందే కదా! ఆ వచ్చిన లాభాలన్నీ నిజాయితీగా వచ్చినవేనా!?' అని ప్రశ్నిస్తూ ధనసృష్టి ఆశలపై నీళ్ళు చల్లాడు.

తరువాత, సౌఖ్యపుర ప్రజలకు నీతి మార్గాన్ని బోధించే గురుస్వామి లేచి, 'ప్రభూ నేను నిత్యం ప్రజలకు నీతి బోధిస్తూ వారిని సన్మార్గంవైపు నడిపిస్తున్నాను. నే చేస్తున్నది గొప్ప పని కాదంటారా!?' అంటూ రాజును ప్రశ్నించాడు.

వెంటనే శశాంకుడు, 'మీరు సర్వసంగ పరిత్యాగులు. అలాంటి మీరు నే చేస్తున్నది గొప్ప పనిగా గుర్తించండంటూ ముందుకు రావడం హాస్యాస్పదం' అంటూ అతడి పనిని తిరస్కరించాడు.



అలా ఎంతమంది ఎన్ని గొప్ప పనుల గూర్చి చెప్పినా అవేవీ శశాంకునికి గొప్పగా అనిపించలేదు.

తన రాజ్యంలో గొప్ప పనులు చేసేవారే కరువయ్యారేనని శశాంకుడు ఆందోళన చెందుతున్న సమయంలో తనకు అవకాశమీయమంటూ ఓ భిక్షగాడు ముందుకొచ్చాడు.

అతడొక భిక్షగాడని చూడకుండా శశాంకుడు అతడికి అవకాశమిచ్చాడు.

వెంటనే ఆ భిక్షగాడు, 'ప్రభూ! నేను మన రాజ పురవీధుల్లో భిక్షాటన చేస్తుంటాను. అలా వచ్చిన భిక్ష నాతో పాటు మరి కొంతమంది ఆకలిని తీరుస్తోంది. నా దగ్గర ఆశ్రయం పొందిన వారందరూ కాటికి కాలు చాపుకున్న కాలంలో కన్న బిడ్డలచే దూరం చేయబడిన వారే. నే చేస్తున్నది గొప్పగా భావించి మీకు చెప్పటం లేదు. ఈ రాజ్యంలో నిరాశ్రయులు చాలామందే ఉన్నారు. వారందరికీ, మీరొక దారి చూపిస్తారని విన్న విస్తున్నాను' అంటూ వినయంగా చెప్పాడు.

భిక్షగాడు చెప్పడం పూర్తవ్వగానే రాజుతో సహా సభికులందరూ హర్షధ్వానాలు చేసారు.

తన రాజ్యంలో చాలామంది తమ తల్లి దండ్రులను అనాధలుగా వదిలి వేస్తున్నందుకు బాధపడ్డాడు రాజు. ఇకపై అలా చేసినవారిని కఠినంగా దండించమని మంత్రికి ఆదేశించాడు. శశాంకుడు అక్కడికక్కడే తన రాజ్యంలోని నిరాశ్రయులందర్నీ రాజ్య సంరక్షణలోకి తీసుకొంటూ, వారందరికీ సంరక్షకునిగా భిక్షగాణ్ణి నియమిస్తూ ఆజ్ఞ జారీ చేసాడు.

శ్రీనివాసరావు, విజయనగరం







# తొందరపాటు

కోడూరులో సుందరయ్య అనే భూస్వామి దగ్గర వెంకులు అనే పాలేరు పనిచేస్తున్నాడు. వెంకులు కూతురు పెళ్ళీడుకి వచ్చింది. ఇక పెళ్ళి చేయాలనుకున్నాడు. ఆ విషయం యజ మానికి చెప్పి ధన సహాయం చేయమన్నాడు.

"సంబంధం కుదరనీ చూద్దాం" అన్నాడు సుందరయ్య.

కొన్నాళ్ళకి సంబంధం కుదిరింది. యజ మానికి ఆ సంగతి చెప్పి డబ్బు అడిగాడు.

"ముహూర్తం పెట్టుకో చూద్దాం" అన్నాడు యజమాని.

ముహూర్తం పెట్టుకున్నాడు. ముహూర్తం కుదిరింది డబ్బు ఇవ్వమని యజమానిని అడిగాడు.

"ఇంకా సమయం వుందిగదా!" అన్నాడు సుందరయ్య.

వెంకులు ఆలోచనలో పడ్డాడు. యజ మాని చూద్దాం, చూద్దాం అని దాట వేయడం ఆందోళన కలిగించింది. ముహూర్తం సమయానికి డబ్బు సర్దుతాడా లేదా అని అనుమానంతో అతనికి నిద్రపట్టడం లేదు. యజమాని నిన్ననే ధాన్యం అమ్మి డబ్బు భోషాణంలో

సిహెచ్. శివరామ ప్రసాద్, హైదరాబాదు



దాచిపెట్టడం చూశాడు. అర్ధరాత్రి లేచి భోషాణం తెరిచి డబ్బు మూట పట్టుకుని ఇంటిదారి పట్టాడు. డబ్బు ఇంట్లో దాచి తిరిగి వచ్చి ఏమీ ఎరగని వాడిలా పడు కుందామని అనుకున్నాడు.

ఐతే అనుకున్నదొకటి, అయిందొకటి. అర్ధరాత్రి చీకట్లో వెళ్తున్న వెంకుల్ని బందిపోటు దొంగలు అటకాయించి, కొట్టి డబ్బు మూట లాక్కుని పారిపోయారు. వెంకులు తెలివి తప్పి పడిపోయాడు. తెల్లవారి ఎవరో చూసి గుర్తించి సుందరయ్య ఇంటికి చేర్చారు. వైద్యుణ్ణి పిలిపించి వైద్యం చేయిస్తే కోలుకున్నాడు వెంకులు.

తర్వాత వెంకులు సుందరయ్య కాళ్ళపై బడి జరిగినదంతా చెప్పి తనను క్షమించమని ఏడవడం మొదలు పెట్టాడు. సుందరయ్య వెంకులుల్ని ఓదార్చి "ఆ డబ్బు నీకు ఇవ్వడానికే భోషాణంలో దాచాను. నువ్వు ఇంటికి తీసుకెళ్తే రక్షణ లేదని ముహూర్తం దగ్గర పడినప్పుడు, పెళ్ళిపనులు మొదలు పెట్టగానే ఇవ్వాలనుకున్నాను. నువ్వు తొందరపడ్డావు" అన్నాడు.

"అయ్యా! నా తెలివి తక్కువ తనం వలన నా కూతురు పెళ్ళి ఆగిపోతున్నది గదా!" అన్నాడు బాధపడుతూ.

"నన్ను నమ్ముకున్నవాడివి. నీ కూతురు కూడా నా కూతురుతో సమానం. పెళ్ళి ఆగిపోనిస్తానా!" అన్నాడు సుందరయ్య.

ఊళ్ళో షావుకారు దగ్గరకెళ్ళి అప్పు తెచ్చి వెంకులు కూతురు పెళ్ళికి సహాయం చేశాడు సుందరయ్య.





# రామ భక్తి

ఓనాడు శ్రీరామచంద్రుని భార్య సీతమ్మ అభ్యంగన స్నానంచేసి అలంకరించుకుంటూంది. పవిత్రమైన సింధూరాన్ని ఫాలభాగంలో చుక్కగా దిద్దుకుంటూంది. అదే సమయానికి ఆంజనేయుడు సీతమ్మ వద్దకి వచ్చాడు. సింధూరం దిద్దుకుంటున్న సీతమ్మని ఆశ్చర్యంగా చూస్తూ, "అమ్మా నీవు ఈ సింధూరాన్ని అక్కడ దిద్దుకోడానికి గల కారణం ఏమిటి చెప్పమ్మా?" అని అడిగాడు. సీతమ్మ నేను అలా చేసినట్లయితే, శ్రీరామునికి ప్రీతి పాత్రురాలి నౌతాను!" అని సమాధానమిచ్చింది.

ఇంకేముంది హనుమంతుడు సింధూరాన్నంతటినీ ఒంటినిండా పట్టించుకుని శ్రీరాముని వద్దకుపోయి గంతులు వేస్తూ "తండ్రీ నీ ప్రేమను పొందగోరి నా తల్లి సీతమ్మ ఈ సింధూరాన్ని ముఖాన అలంకరించుకుంటుంది గదా! నేను ఒంటికి మొత్తం దీన్ని పూసుకుంటే, నీకు ఇంకా ఎంత ప్రీతి పాత్రుణ్ని అవుతానో కదా అని ఇలా చేశాను. ఇదే నా సంతోషానికి కారణం స్వామీ!" అంటూ నమస్కరించాడు. విషయం గ్రహించిన శ్రీరాముడు పరమభక్తుడైన ఆంజనేయుని ప్రేమతో ఆలింగనం చేసుకుని, "నాయనా, నీవు కోరినట్లే జరుగుతుంది. నీ భక్తి ఆ చంద్ర తారార్కం కీర్తింపబడుతుంది!" అని దీవించాడు. ఈ కారణంచేతనే గుడిలోని ఆంజనేయుని విగ్రహం పూర్తిగా సింధూరంతో అలంకరింపబడి ఉంటుంది.

ఎమ్. నర్మద, *విజయనగరం*





# కర్ణుని గొప్పదనం

మహాభారత యుద్ధం మొదలైంది. కర్ణార్జునుల మధ్య ఘోరయుద్ధం జరుగుతోంది.

ఒక దశలో, కర్ణుడు నాగాస్త్రాన్ని తీసి సుదుటకద్దుకొని, దాన్ని అర్జునునిపై ప్రయోగించాడు. అమోఘమైన ఆ బాణం అతి వేగంగా పోయి అర్జునుని శిరస్సు ఖండించేదే! ఇది గ్రహించిన శ్రీ కృష్ణుడు అర్జునుని రథాన్ని క్రిందికి నొక్కిపట్టి వుంచడం వల్ల నాగాస్త్రం అర్జునుని శిరస్సుకి అర్ధంగుళం మీదుగా పోయి వ్యర్థమైంది.

నాగాస్త్రం అదే వేగంతో తిరిగి కర్ణుని వద్దకు చేరి, "కర్ణా! శ్రీకృష్ణుని మాయవలన నా గురి వెంట్రుక వాసితో తప్పింది. రెండవసారి నన్ను అర్జునునిపై ప్రయోగించు, శ్రీకృష్ణుడే కాదు త్రిమూర్తులు మాయలు పన్నినా, అద్వితీయ శక్తిగల నేను వాటిని ఛేదించి అర్జునుని శిరస్సు ఖండిస్తాను. హూ! నన్ను ప్రయోగించు, నీకు విజయం చేకూరుస్తాను" అంటూ కోరింది.

కర్ణుడు యుద్ధం చేస్తూనే నాగాస్త్రం మాటలు విని, "నాగాస్త్రమా! నన్ను మన్నించు. ఒకసారి ప్రయోగించిన బాణాన్ని ఎట్టి పరిస్థితుల్లోనూ రెండవసారి ప్రయోగించేందుకు నేను ఇష్టపడను. దయచేసి నిష్క్రమించు" అంటూ నాగాస్త్రానికి నమస్కరించాడు.

ప్రాణాపాయ స్థితిలోనైనా నియమం తప్పని కర్ణుని గొప్పదనానికి నాగాస్త్రం ముగ్ధురాలై నిష్క్రమించింది.

శ్రీపాద సత్యనారాయణ, *విజయనగరం*

# కాశీ సమీపంలో గణేశాలయాలు

కాశీనగరం చాలా పవిత్రమూ మరియు పురాతనమైన నగరం. కలియుగాంతంలో సృష్టి అంతమైన కాశీకి అంతంలేదని మరల సృష్టి అక్కడినుంచే ప్రారంభమవుతుందని అంటారు. సర్వదేవతార్చనలకు ముందు అగ్రపూజనందుకునే గణేశునికి కాశీ నగరానికి అవినాభావసంభందం వుంది. కాశీనగరంలో 56 గణేశ విగ్రహాలున్నాయి. కాశీ నగరానికి చుట్టూరా మహత్తరమైన గణేశాలయాలున్నాయి. కొన్ని ఆలయ విశేషాలు గమనించండి.

కాశీనగరం నుండి 16 కిలోమీటర్ల దూరంలో రామేశ్వర మందిరం వుంది. ఆ మందిరం నుండి దక్షిణ పంచకోశ అనే ప్రాంతానికి వెళ్ళే దారిలో 45 అడుగుల ఎత్తుండే డెహలీ వినాయక మందిరం వుంది. చతుర్భుజాలు కలిగి వుండే గణేశుని వెనుక ఉత్తరంలో 7 అడుగుల నృసింహమూర్తి, తూర్పుదిశలో 7 శివమూర్తులు, నంది వున్నాయి.

డెహలీ వినాయక మందిరం రామేశ్వర మందిరం మధ్య దారిలో భూయిలీ అనే గ్రామంలో ఉద్దణ్డ గణేశమందిరం వుంది. 7 అడుగుల 9 అంగుళాల పొడవు, ఆరు అడుగుల వెడల్పు వున్న మందిరంలో 5 అడుగుల ఎత్తైన గణేశమూర్తి వుంది.

కాశీనగరం భూతనాథ మందిరం వెనుక పంచాస్య వినాయక మందిరం వుంది. నాలుగు భుజాలు కలిగిన స్వామి రెండు చేతులు తొడలపై, రెండు చేతులలో త్రిశూలం, ఆయుధం పట్టుకున్నట్లుంటుంది. మందిరం పక్కనే శివలింగం, అష్ట భుజదుర్గామందిరం.

కాశీకి సమీపం 'సిగర' అనే చోట వానర సింహ, ఏనుగు ముఖాలు కలిగిన త్రిముఖ వినాయకుడున్నాడు.

వాల్మికి టీలాలోని అనాథాలయం దగ్గర 80 అడుగుల ఎత్తైన హేరంభ వినాయక మందిరం వుంది.

కాశీనగరంలో క్త్రీజ్ అనే దిన పత్రిక కార్యాలయం దగ్గర దంత హస్త వినాయకాలయం వుంది. పది హస్తాలు కలిగిన స్వామి ఒక చేత్తో తింటూ మరో చేతిని లక్ష్మీదేవిపై వుంచినట్లుంటుంది. రెండు పక్కలా సిద్ధి భుద్ధి కూడా వుంటారు.

*జి. ప్రభాకర రావు, ఖమ్మం*

**Edited & Published** by B.V. Radhakrishna, No.61 (Old No.29), West Mada Church Street, Royapuram, Chennai-600 013. (25904415, 25904748, 25975198). Printed by B.R.Govindaraju B.Com., at 59/60, West Mada Church Street, Royapuram, Chennai-600 013.



